శ్రీరస్తు.

# జగద్గురు శ్రీశంకరభగవత్పాదాచార్య చరిత్రము

(వచనము.)

తిరుపతి డిస్ట్రిక్టు మునసఫుకోర్టులో న్యాయవాది ప్రముఖులుగనుండి ప్రకృతము వేదాంతగ్రంథ కాలక్షేపము చేయుచున్న

శ్రీ పుట్లూరు కృష్ణస్వామయ్యగారిచే

రచియింపఁబడినది.

మద్రాసులో పచ్చయప్పకళాశాలలో తెలుగు పండితులగు మ. రా. రా. శ్రీ. [illegible] శాస్త్రుల వారిచే బరిష్కరింపఁబడినది.

—— : o : ——

విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాల,

చిత్తూరు.

1928.

 [వెల రు 0—12—0.



జగద్గురు శ్రీశంకరాచార్యస్వాములవారు.



శ్రీరస్తు.

మహాగణాధిపతయే నమః.

శ్రీ శంకరదేశికేంద్రాయ నమః.

# ఉపోద్ఘాతము.

ఈ భరతఖండమున నవతరించిన మహనీయులలో శ్రీ శంకర భగవత్పాదుల యసాధారణ ప్రజ్ఞయు, నిర్మలమైన యాత్మయు, గంభీరమగు హృదయమును, శాంతమగు చిత్తమును, ఘనమైన మనోభావమును బడసినమానవుండు మఱియొకండు గనంబడండు. మఱియు, వేదశాస్త్రములందు వారిపరిజ్ఞానమును, మతప్రచారణము నందలి శ్రద్ధయు, విషయములను జర్చించుటయందుఁ జతురత్వము ను, నసదృశములు. వారి యమానుషప్రజ్ఞను గుఱించి మన దేశ మందలి విద్వాంసులేకాక పాశ్చాత్యపండితులుగూడ నాశ్చర్యము నొందుచున్నారు.

మన దేశమునఁ బూర్వము ప్రబలియుండిన జైన, బౌద్ధాది దుర్మతములను ఖండించి, శ్రీమదాచార్యులవారు స్థాపించిన యద్వైతమతము కీర్తి గాంచినదనుట యెల్లఱకు విదితము. వారొనర్చిన మతసిద్ధాంతములు, కేవల మూఢభక్తితోఁ గూడిన కర్మాచరణమునుండియు, నాస్తికభావమునుండియుఁ దొలఁగించి మన దేశము నందలి జనులను గాపాడెను. వారి సిద్ధాంతములు సర్వజన సమ్మతములుగ నుండుటఁ జేసి యమ్మహనీయులు జగద్గురువులనికూడ ప్రఖ్యాతి వహించిరి.

ఇట్టి మహనీయుల పుణ్యచరిత్రమును, వా రవతరించిన కాలమును, జనులకిదివఱకుఁ జక్కగఁ దెలియకుండుట మిగుల శోచనీయముగదా? వారిచరిత్రమును వ్రాసిన పెక్కురు పండితులలో వారి యవతారకాలమునుగూర్చి కొందఱు క్రీస్తుకుఁ బూర్వము

ప్రథమ శతాబ్దమనియు, కొందఱు క్రీస్తుకు వెనుకఁ బ్రథమ శతాబ్ద
మనియు, మఱికొందఱు క్రీస్తుకుఁ దర్వాత 5-వ శతాబ్దము మొద
లు 8-వ శతాబ్దము వఱకనియును, వారివారికిఁ దోఁచిన యుపపత్తు
లతోఁ గాలనిర్ణయముఁ జేసియున్నారు. ఇట్లుండుటంజేసి శ్రీ
శంకరు లవతరించిన కాలమును నిష్కర్షగాఁ జెప్పుటకు నేటివఱకు
నెవ్వరికిని సాధ్యముగాకున్నది.

వారు వర్ధిల్లిన కాల మెప్పుడైన నగుంగాక. వారి పుణ్యా
చర్యలు, వారు రచించిన గ్రంథములు, వారొనర్చిన మత సిద్ధాంత
ములు, వారికీర్తి యివన్నియు శాశ్వతములుగ నుండలేదా యని
వచించెదరుకాఁబోలు ? అవన్నియు, శాశ్వతములుగా నున్నను
వారవతరించిన కాలము తెలియుటవలన వారికాలములో నీ భర
తఖండమున వర్ధిల్లిన శ్రీచిత్సుఖ యతీంద్ర, కుమారిలభట్ట, మండ
నమిశ్ర, సుధన్వ, శ్రీహర్ష విక్రమాదిత్య, వృషదేవవర్మేత్యాది బ్రహ్మ
క్షత్రియ ప్రముఖుల కాలము సహితము తెలియడమేగాక వారి
పూర్వాచార్యుల కాలమునున్ను, తెలిసికొనుటకు వీలుగలిగి హిం
దూదేశముయొక్క ప్రాచీనచరిత్రమును వ్రాయు నావికులవంటి
వారికి శ్రీ శంకరభగవత్పాదులవారి జననకాల మొక పెద్ద రేవు
దీపముగ (Light House) నుండుట జేసి యట్టి మహనీయులు
వర్ధిల్లినకాలము ముఖ్యముగఁ దెలియవలసియున్నది.

ఇదిగాక, శ్రీశంకరులవారి చరిత్రముకూడ, పెక్కుగ్రంథ
ములలో వారికిఁ బిదప కామకోటిపీఠము నలంకరించిన యాచార్యుల
లో ముప్పదియాఱవవారగు శ్రీ అభినవ శంకరాచార్యులవారి
చరిత్రముతో మిశ్రమైయుండుటవలన దానిని ప్రత్యేకించి జనుల
కెఱింగించుట మిగుల నవశ్యముగ నున్నది.

పై కారణములవలన శ్రీ శంకరభగవత్పాదులనుగూర్చి
వ్రాయఁబడిన చరిత్రముల ననేకములఁ బరిశోధించి వానిలో శ్రీజగ
ద్గురు శంకరాచార్యస్వాముల వారిని గుఱించిన యంశములను

మాత్రము సంగ్రహించియు, వారి యవతార కాలమును గుఱించి, వారిసహాధ్యాయులును ప్రథమ శిష్యులు నగు శ్రీ చిత్సుఖాచార్య విరచిత బృహచ్ఛంకరవిజయమును, వ్యాసాచల కవి యనంబరంగు సర్వజ్ఞ విష్ణువను పూర్వాశ్రమనామధేయంబు వహించి విద్యాతీర్థుల ను నాశ్రమ నామధేయముతోం గామకోటి పీఠము నలంకరించిన యాచార్యులును విద్యారణ్యస్వాములవారికి పరమగురువులు నగు మహనీయులవలన రచింపంబడిన వ్యాసాచలీయ శంకరవిజయ మను గ్రంథమును, శ్రీమదాచార్యులవారి భాష్యములకు వ్యాఖ్యాన గ్రంథ ముల రచించినవారును, ఆనందజ్ఞానులను నాశ్రమ నామధేయము తోంగామకోటిపీఠము నలంకరించిన యాచార్యులు నగు వారివలన రచింపంబడిన ప్రాచీన శంకరవిజయ మను గ్రంథమును ప్రమాణము లుగాం గైకొనియు, నీ గ్రంథమును రచించితి.

పైకనిన గ్రంథకర్తలు ముగ్వురును వేర్వేరు కాలములలో వర్థిల్లినవారయ్యును, శ్రీమదాచార్యులవా రవతరించిన కాలము నేక రీతిని వివరించి యుండుటవలనను, వారు నిర్ణయించియుండు కాల ము మనప్రాచీన పురాణముల ననుసరించి యుండుటయేగాక, జిన విజయమను జైనమతస్థాపకునియొక్క చరిత్రమువలనంగూడ స్థిరపడి యుండుటవలనను, వానిని ప్రమాణములుగ గ్రహించినాండను.

హిందూదేశముయొక్క ప్రాచీన చరిత్రమున, ముఖ్యవిష యమగు జగద్గురు శ్రీ శంకరభగవత్పాదుల యవతార కాలమును గూర్చి జనులకుం గలవరము గలిగియున్నది. కావున సప్రమాణముగ శ్రీమదాచార్యులవారి జననకాలమును నిర్ణయించి యాకలవరమును బోంగొట్టందలంచి యాపూజ్యచరణుల దివ్య చరిత్రమును రచించుట కుం బూనితినిగాని యితర ప్రయోజనముల నపేక్షించిన వాండను

ఈ పుణ్య చరిత్రమును మన దేశమందలి జనులు శ్రద్ధతోఁ బఠించి శ్రీశంకరభగవత్పాదులవా రవతరించిన దినమున వారిని భక్తితోఁ గొలిచి యుత్సవాదుల సలిపి వారు బోధించిన యద్వైత జ్ఞానమును బడయ ప్రయత్నింతురేని, అదియే మహత్ప్రయోజన మని మదినెన్ని సంతసింతు.

చిత్తూరు,
20—3—28

ఇట్లు సజ్జన విధేయుఁడు,
శ్రీ శేషులూరు కృష్ణస్వామయ్య,
రిటైర్డు ఫస్టుగ్రేడ్ ప్లీడరు,
తిరుపతి.



శ్రీరస్తు

శ్రీమచ్ఛంకరగురవేనమః.

# జగద్గురు శ్రీ శంకరభగవత్పాదాచార్య చరిత్రము.

---

## శ్రీ గణాధిపస్తుతి.



అగణితమహిమాభ్యుదయం అఖి
లశరణ్యాం వరేణ్యమగ్రగణ్యం।
భవభయహరణధురీణం భజేహ
మాద్యంగణేశమఖిలేడ్యం॥

## శ్రీ సరస్వతీ స్తవము.

శ్రీమచ్చందన చర్చితోజ్జ్వలవపుశ్శుక్లాంబరాకామదా।
వామాలంకృత కుంతలాప్రవిల సన్ముక్తావళీశోభనా।
సర్వజ్ఞాన నిదాన పుస్తకధృతా శుభ్రాక్షమాలాధరా।
వాగ్దేవీ వదనాంబుజే వసతుమే త్రైలోక్యమాతాచిరాత్॥

## శ్రీ మదాచార్య స్తోత్రము.

కాషాయాంబరధారిణం గురువరం వీరాసనాధ్యాసినం।
ముద్రాంజ్ఞానమయీం దధానమపరే హస్తాంబుజే పుస్తకం।
శిష్యాన్ పార్శ్వగతాన్ సుపుస్తకధరాన్ తేజోధికాన్ నిర్మలాన్
పశ్యన్తం కరుణాకరం గుణనిధిం శ్రీశంకరార్యంభజే॥

శ్రీమంతంబై సకల సుమనో మనోహరంబై ధర్మదేవతా
వాసంబై కర్మభూమియనఁ బేరుగాంచిన యీభరతఖండమునఁ
గేరళంబను నొండు దేశంబు గలదు. తొల్లి రాజశేఖరుండను నృప
కుంజరుం డా దేశమును బాలించుచుండెను. ఆ దేశమున నొక్కచో
"చూర్ణినది" యను నొక్కనదీతీరమున నానావృక్ష లతానికుంజ
నిబిడితంబై చూపఱుల కద్భుతంబు గొలుపుచు సురనదినిగూడిన
త్రికూటంబుపోలికి వృషాద్రియను నొక్కపర్వతరాజంబు నెగడుచుం
డు. పూర్వమొకప్పుడు మనభరతఖండము పాషండమతములం
బెచ్చు పెరిఁగి నాస్తికజనభూయిష్ఠమై యుండఁగా, లోకానుగ్రహార్థము
పరమకారుణికుండగు శ్రీపరమేశ్వరుఁ డప్పర్వతశ్రేష్ఠమున జ్యోతిర్లిం
గాకృతి నావిర్భవించె. అంత నా దేశాధీశుండగు రాజశేఖరు స్వప్నం
బున నొక్కనాఁ డమ్మహేశ్వరుఁడు సాక్షాత్కరించి వృషాద్రిపైఁ దన
కొక్కయాలయమును నిర్మింపఁ బ్రేరేచిన నప్పుడమిఱేఁ డప్పశుపతి
కొక్కసుందరంబగు మందిరంబును గట్టించి త్రికాలంబులఁ బూజలు
సలుప శిష్టుల నియోగించి మిగుల భక్తితో నప్పరమేశ్వరుని సేవిం
చుచు నప్రమత్తుండై రాజ్యభారమును నిర్వహించుచుండె.

ఆ దేవాలయంబున కనతిదూరంబున వేదవేదాంగ పారం
గతులై బ్రహ్మవర్చసమునఁ బితామహులంబోలి విప్రసత్తముల, కాక
రంబై కేరళదేశంబునకు శిరోభూషణంబోయనఁ గాలటియను
నొక్క యగ్రహారంబు విలసిల్లుచుండును. రజతాచలంబున విరా
జిల్లు మహేశ్వరుండే యా వృషాచలమున వసియించుటం జేసి
వృషభారూఢుండైన మహేశ్వరునిమాడ్కి జ్యోతిర్లింగమునుగూడి
యావృషాద్రి భూభాగమున కఖిల ధర్మస్వరూపమై యొసఁగుచుం
డెను. అట్టి ధర్మస్వరూపుఁడగు పరమేశ్వరుని యునికిం జేసి,
అయ్యగ్రహారంబున నివసించు భూసురుల కేవిధమైన యుపద్రవ
ములు లేకుండెను. అందు బుద్ధినమర గురునకెనయై
నిఖిల విద్యావిశారదుండై సమస్త దిఙ్మండలములం బ్రసిద్ధిఁ

గాంచిన ధీరోదాత్తచిత్తుండగు విద్యాధినాథుండను నొక్క విపశ్చి ద్వర్యుండుండెను.

ఆ సుజనాగ్రగణ్యునకు శివగురు దీక్షితుండను సుగుణఖని యైన పుత్త్రుండు గలిగె.

ఆ శివగురుండు, సకల సుఖంబుల ననుభవించుచుండినను, పుత్త్రులు లేరను కొఱంత యాతని దురంత చింతాక్రాంతునింజేయఁ గా పరమేశ్వరానుగ్రహంబు వడసి పుత్త్రుంగాంచ నిశ్చయించి ధర్మ పత్నియగు నార్యాంబతోడ, దాపుననున్న వృషాచలాధిష్ఠితుండ గు వృషభేశ్వరునిగూర్చి దారుణ తపంబొనర్చుచుండె.

ఇట్లుండఁ ద్రిలోక సంచారియు బ్రహ్మమానస పుత్త్రుండు నగు నారదమహర్షి భూలోకంబున కేతెంచి యందలి జనులు శూలచక్రాది చిహ్నములను ధరించి, పాశుపత, వైష్ణవ, భైరవీ యాది దుర్మత దురాచార ప్రవిష్టులై ద్వైతమతము నవలంబించి యుండుటంగాంచి, జాలినొంది సత్యలోకంబున కరిగి బ్రహ్మదేవున కావృత్తాంతంబు నివేదించె.

చతురాననుండు గొంతతడవు మానముద్రందాల్చి యాలో చించి యాదుర్దశఁ బాపుటకుఁ దా నసమర్థుండనియు, నట్టి ఘన కార్యంబునకుఁ బూనుకొనుటకు శంకరుండే సమర్థుండనియు నిశ్చ యించి నారదుంజూచి "మానివర్యా! ఇట్టికార్యంబు నాచేనైనది కాదు. ఎవ్వని జ్ఞానామృత కణంబు మాదృశులకుఁగూడ దుస్సా ధ్యంబై యున్నదో ఆమహాపురుషుండును జ్ఞానస్వరూపుండు నగు పశుపతియే యీకార్యంబు సమర్థింపనోపు" నని తెలియఁజెప్పె. మునిపుంగవుం డొక్కని కైలాసంబున కరిగె.

అట్లు వారు కైలాసంబుఁ జేరి చిన్మూర్తియగు మహాదేవున కాచందంబు నివేదింప, మహేశ్వరుం డిట్లనియె. "చతురాననా! నీవిప్పుడెఱింగించిన విధమంతయు నింతకుఁబూర్వమే నేనెఱుంగుదు. భూమండలంబున శోభాయమానంబగు కేరళదేశంబున వృషభేశ్వ

రు నిలయంబగు వృషాచలంబుచేతను జూర్ణీనదిచేతను పవిత్రవంత ముగఁ జేయఁబడియున్న కాలటి యను నగ్రహారంబున, పుత్రార్థి యై యార్యాంబ యను నిజ భార్యంగూడి తపంబొనర్చుచున్న శివగురుండను విప్రోత్తమున కేను సుతుండనై జన్మించి యా దంప తుల కోర్కెలం దీర్చి భూతలంబున నెల్లెడ వ్యాపించియుండు దుర్మతంబుల ఖండించి యద్వైతమత స్థాపనంబు గావింతు. నీవు వగవంబనిలేదు. నీకార్యంబులం దప్రమత్తుఁడవై యుండు" మని చెప్పి యవ్విధాతంబంపె.

అంత నొక్కనాఁడు, బాలభానుండు పూర్వపర్వత శృంగం బు నలంకరింపకయమున్న నక్షత్రంబుల కాంతి కనఁబడియు కనఁ బడకయు నుండు సమయంబున మహేశ్వరుండు విప్రరూపంబు దాల్చి యా దంపతుల కిరువురకును స్వప్నంబునఁ గనఁబడి యిట్లని యె. "పుణ్యాత్ములారా! నేను మీతపంబునకు మెచ్చి మీ యభీ ష్టంబు గావింపఁ దలంచితి. గుణజ్ఞుండును, సకల శాస్త్ర పారం గతుండును నల్పాయుష్కుండు నగు నొక తనయునైనను, లేక, దీర్ఘాయుష్మంతులు, వివేకహీనులు, మూర్ఖులు నగు పెక్కండ్రు పుత్త్రుల నైనను గోరి కొనుఁడు. మీకోర్కె నెఱవేర్చెద" నని చెప్పుటయు, నాదంపతులు ప్రత్యుత్తరమేమియుఁ జెప్పుటకుఁ దోఁచనివారై కొంతతడవాలోచించి "ఏకోపిగుణవాన్ పుత్రో నిర్గు ణైః కింశతేనతైః" అను శాస్త్రోక్త వచనంబు మనంబున నంకు రింప, గుణహీనులు మఱియు నవివేకులు నగు తనయులు పెక్కండ్రు భూమిపై నుండి యపకీర్తిఁదెచ్చుట కన్నను, గుణజ్ఞుండును వివేకియు నగు పుత్త్రుం బడసి వంశమునకుఁ గీర్తిఁదెచ్చికొనుట తగినదని తలం చి, యట్టి తనయు నొక్కని నిమ్మని ప్రార్థింపఁగా, వృషభేశ్వరుం డట్లే యగుఁగాక, యని యనుగ్రహించి యంతర్హితుండయ్యె.

అనంతర మాదంపతులు మేల్కాంచి తమ స్వప్నవృత్తాం తంబుల నొండొరులకుఁ జెప్పికొని యావృత్తాంతం బేకరీతిగ నుం

డుటకు మిగుల విస్మితులై భక్తవత్సలుండగు భగవంతుని కృపా
కటాక్షము నేఁటికిఁ జేకూరెఁగదా ? యని తలంచి పులకితగాత్రులై
యానందబాష్పకణ పూరితలోచనులగుచు, దేవుని ధ్యానించి
బ్రాహ్మణసంతర్పణం బొనర్చి తద్భుక్తశేషంబు తాము భుజించు
నవసరంబున నొక జ్యోతి యాయన్నంబుఁ బ్రవేశింప, దానిం గడు
ముదంబున భుజియించిరి.

అంత నమ్మహేశ్వరుని మాహాత్మ్యంబున నా పతివ్రతాశిరో
మణియగు నార్యాంబ గర్భంబు ధరించి యుక్తకాలంబున కలియు
గమున 2593-వ సంవత్సరమునకు సరియగు నందన (క్రీ. ముం. 509) సంవత్సర వైశాఖశుద్ధ పంచమి భానువాసర పునర్వసూ నక్షత్రయుక్తంబగు శుభదినమం దభిజన్ముహూర్తమున, రవ్యంగారక గురు శనైశ్చర గ్రహము లుచ్చకేంద్రములను బొంది, శుక్రుఁడుచ్చస్థితిని బుధుఁడు రవిసంబంధమును గలిగి శుభగ్రహ సంపత్తితో నొప్పిన కర్కాటక లగ్నమందు పార్వతీదేవి కుమారస్వామిని ప్రసవించినట్లు మహేశ్వరాంశంబగు నొక్క సుపుత్త్రిం గనియె.*

| శు | ర బు | | చం |
|---|---|---|---|
| | లగ్నకుండలి. | | ల గు |
| కు | | | |
| | | శ | |

కైలాసనాథుఁడగు శ్రీపరమేశ్వరానుగ్రహంబునఁ దనకుఁ
బుత్త్రుఁడు జన్మించుటం జేసి, శివగురుదీక్షితుం డాశిశువునకు శంక
రుండను నన్వర్థనామధేయంబిడి జాతకర్మ నామకరణాదులను మిగుల
విభవంబున నెఱవేర్చెను. ఆ బాలుండు శిరమున బాలేందురేఖ

* శ్రీశంకరుల యవతారకాల విశేషములఁగూర్చి, యిందుకనుబంధముగాఁ
జేర్పఁబడిన శ్రీచిత్సుఖాచార్యులవారు రచించిన బృహచ్ఛంకర విజయములోని
శ్రీమదాచార్యులవారి యవతార ప్రకరణమును చూడుఁడు.

యు, ఫాలమున నేత్రచిహ్నమును, భుజములందు శూలరేఖలును గలిగియుండుటం జేసి, జనులందఱు నాతని శ్రీశంకరావతారమనియే తలంచుచుండిరి.

ఇట్లా బాలుండు పూర్వపక్ష చంద్రబింబంబుపగిది, దినదినాభివృద్ధినిగాంచుచుండుటను గని యాదంపతులు డెందంబున నత్యంతానందంబుగాంచుచు, తృతీయప్రాయమున నాతనికి చౌలంబు గావించి యక్షరాభ్యాసంబు సహితం బానర్చి విద్యాభ్యాసముకొఱకుం దగునుపాధ్యాయుల నేర్పఱచుటయు, నాబాలుం డీశ్వరాంశసంభూతుండగుటవలన నేకసంతగ్రాహియై శీఘ్రకాలమున విద్యాభివృద్ధిని బొందుచుండె.

అంత, శివగురుదీక్షితుండు తనయుని బుద్ధికుశలతను గాంచి యయిదవయేట నుపనయనంబు జరిపి వేదవేదాంగములను, సకలశాస్త్రములను జెప్పింపం దొడంగఁగా, నక్కుమారరత్నంబు నేర్పించిన విద్యలనెల్ల నతిరయమున గ్రహించుచుండె. ఇట్లు శంకరులు గురుకులమునందుండి విద్యాభ్యాసముచేయుచు, భిక్షాన్నమును దెచ్చికొని భుజించుచుండెడి తరుణమున నొక్కనాఁడు భిక్షార్థియై యొక బీదబ్రాహ్మణుని గృహంబున కరిగిరి. అట్లు తెంచిన శంకరుల నా గృహిణిచూచి భిక్షార్థియై వచ్చిన బ్రహ్మచారికి భిక్షము నొసంగనియెడల మహాపాతకము సంభవించునని యెఱింగియుండియు, తమ దారిద్ర్యవశమున భిక్షమిడుటకొక యన్నకబళమైనను లేమింజేసి, ఖిన్నురాలై యింట నలుదెసలఁ బరికింపఁగా నొకయుసిరికపండు కనఁబడెను. అంతట, నాసాధ్వి యించుక సంతసంబున నా బ్రహ్మచారికి నా యామలకంబు నత్యంత ప్రీతితో నొసంగె.

పరమదయాళువగు శంకరు లప్పతివ్రతా శిరోమణియొక్క దారిద్ర్యమును జూచి మిగులఁ జింతనొంది యాదంపతుల దీనస్థితిని

వారింపఁ దలఁచి యాక్షణమే, శ్రీలక్ష్మీదేవినిగూర్చి *స్తుతించిరి.

అట్లు శంకరులు ద్వావింశతి శ్లోకంబుల లక్ష్మీదేవి యుల్లంబు సంతసిల్లంజేయఁగా, నందులకా భక్తాభీష్టప్రదయగు నిందిర, దయార్ద్రదృష్టితో నా బీదబ్రాహ్మణులయింటిముంగిట కనకామలక వర్షముఁ గురిపించి యంతర్హితయయ్యె. ఈ యసాధారణ సామర్థ్యాతిశయంబుగాంచిన వారందఱు, శంకరులు దేవాంశసంభూతులే యని నిశ్చయించిరి.

మఱియు, శంకరులు సప్తవర్షప్రాయులై యుండఁగనే బహువిద్యాప్రవీణులై "బాలబోధ సంగ్రహ"మను నొక గ్రంథమును గూడ రచించి వేదరహస్యమును వారిసహాధ్యాయులకెల్ల బోధింప సాగిరి.

ఇట్లుండ, శివగురుదీక్షితుండు తనయుని బాల్యంబుననే యక స్మాత్తుగ శరీరమును విడిచి సచ్చిదానందాత్మకంబైన బ్రహ్మసాయుజ్యంబు నొందెను.

అనంతరము శంకరులు తండ్రికి జరుపవలసిన యౌర్ధ్వదైహిక క్రియలఁ జరిపి సంవత్సరాంత శ్రాద్ధముతోడఁ బితృయజ్ఞమును పూర్తిగావించి, సన్న్యాసాశ్రమంబు స్వీకరింప నాసక్తులై తల్లి నాశ్రమస్వీకారంబున కనుజ్ఞయిమ్మని ప్రార్థించిరి. గృహస్థాశ్రమానుభవము సన్న్యాసాశ్రమమునకుఁ బూర్వముండవలసినట్లు లోకమున వాడుకయుండుటచే నద్దాని ననుసరించి తల్లి శంకరులకుఁ దురీయాశ్రమంబు స్వీకరింప ననుజ్ఞ నొసంగకయుండె.

అట్లు బ్రహ్మచర్యాశ్రమముననే యుండి శంకరు లొక్కదివసంబున తల్లివెంబడి స్నానార్థము చూర్ణీనదికిఁబోయి యందొక్క మడువున స్నానముచేయుచుండ, నొక్క మొసలి వారి పాదంబులం బట్టుకొని లోఁతునీటిలోనికి లాగుటకుఁ బ్రయత్నింపఁగా, వారు తల్లినిబిలిచి "అమ్మా! మొసలియొకటి నాపాదంబుఁబట్టుకొని

* ఈ స్తవమునే యిప్పటికిని "కనకధారాస్తవ"మని పెద్దలు నుడువుచుందురు.

నన్నుఁజంప సమకట్టియున్నది. ఈ యాశ్రమంబుననుండి నేను మృతినొందుదునేని నాజన్మంబు వ్యర్థంబగును. సన్న్యాసినై చచ్చినంతట సాయుజ్యంబు గలుగు. లేదా, సన్న్యాసంబు పునర్జన్మము వంటిదగుటవలన, సన్న్యసించినయెడల నొకవేళ నీ గండము తప్పిపోయి నేను బ్రతుకవచ్చును. కావున సన్న్యాసంబు స్వీకరింప ననుజ్ఞయిమ్ము" అని ప్రార్థింపఁగా, నార్యాంబ తన పుత్త్రుఁడు సన్న్యాసిగానైనను బ్రతికియున్నఁ జాలునని తలంచి తదాశ్రమ స్వీకారంబున కనుజ్ఞనొసంగెను.

పిమ్మట నవమప్రాయంబున, శంకరు లాశ్వయుజ శుద్ధ పౌర్ణిమ అశ్వినీ నక్షత్రముతోఁగూడిన శుభదినమునందు సన్న్యాసాశ్రమయోగ్యంబగు మంత్రోచ్చారణంబుఁజేసి, మానసిక సన్న్యాసంబు స్వీకరించుటయు, నమ్మొసలి వారిపాదంబువదలి తన తొల్లింటి శరీరంబుఁదాల్చి వారికిఁ బ్రణమిల్లి యిట్లనియె.

"దేవా! ఏను పుష్పరథుండను గంధర్వపతిని. తొల్లి యొకానొక సమయమున బ్రహ్మదేవుని యాజ్ఞనుల్లంఘించుటంజేసి యాతండు నన్ను మొసలిరూపంబు దాల్చుమని శపించె. ఆశాపంబునకు వెఱచి నేను శాపమోక్షంబు దయసేయుండని ప్రార్థింపఁ జతురాననుండు కరుణించి భూలోకంబున నద్వైతమతస్థాపనంబు సేయుటకు మహేశ్వరుం డవతరింపం గలవాఁడు. ఆతని పాదస్పర్శనంబువలన నీకు శాపవిమోచనంబగునని యానతిచ్చె. కాన నిత్తఱి నేను ధన్యుండనైతిని. ఇఁక, నేను దివంబునకరుగ ననుగ్రహింపుఁడ"ని శ్రీశంకర భగవత్పాదులవారి యానతిఁగైకొని యాగంధర్వుఁడు స్వస్థానంబుఁజేరెను.

అంత శ్రీమదాచార్యస్వాములవారు తల్లికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి శాస్త్ర విధి ననుసరించి గురుసేవచేసి దేశాటనం బొనరించుటకు ననుజ్ఞ నిమ్మని వేఁడుటయు నార్యాంబ పలువిధంబులఁ దపంబుఁజేసి తుదకు మహేశ్వరానుగ్రహంబున పుత్త్రునిఁ

బడసియుండుటవలన కర్ణకఠోరంబగు తనయుని మాటల వినినతో
డనే స్మృతిదప్పి పలుకకయుండి మఱల కొంతసేపటికిఁ బ్రజ్ఞాన్వితయై
తనయున కిట్లనియె. "నాయనా! ఎన్నినోములనోచియో మఱియు,
నెంతతపంబొనరించియో ఈశ్వరానుగ్రహమువలన సర్వజ్ఞుండవగు
నిన్నుఁ గన్న నాకుఁ దుదకు దిక్కులేని చావు తటస్థించునుగదా?
పుత్త్రుండవగు నీచేతిమీఁదుగా నాకు చరమ క్రియలు జరుగనియెడల
నాజన్మము వ్యర్థమగును. 'అపుత్త్రస్య గతిర్నాస్తి', 'పుత్త్రమంత్యేచ
కర్మణి' యనిగదా పెద్దలు చెప్పుచున్నారు. నేనంతటి సుకృతముగూడ
చేయనిదాన నైతిఁగదా! నాదౌర్భాగ్యము నేమనవచ్చును", అని
కన్నీటినించి డగ్గుత్తికతోఁ బలుకఁగా శంకరభగవత్పాదులవారు తల్లిని
ధర్మబద్ధంబులగు శాంతవచనంబులతో నూఱడించి "తల్లీ! నీయిష్టా
నుసారము నీ చరమక్రియలను స్వయముగా నాచరించెదను. మఱియు
నీవు నన్నెప్పుడు స్మరింతువో తత్క్షణమున నీచెంతఁజేరి నీయభీష్టము
నెఱవేర్చెద. నీవు దుఃఖింపఁ బనిలేద"ని ధైర్యముఁజెప్పి తల్లి యనుమతి
వడసి కాలటినుండి బయలువెడల నుద్యుక్తులై యుండ, నొక్కరేయి
శ్రీశంకరులు నిదురించుచుండఁగా వారిస్వప్నమున నచ్యుతుండు
కనుపించి నర్మదాతీరముననున్న శ్రీగోవిందభగవత్పాదులవారి
సన్నిధినిజేరి క్రమసన్న్యాసంబు గ్రహింపుమని యాజ్ఞాపించుచుఁ
బ్రయాణమున నీకు శుభంబయ్యెడి నని యనుగ్రహించి యంతర్హి
తుండయ్యె.

అంతట శ్రీభగవత్పాదులవారు తటాలున మేలుకొని పరమ
కారుణికుండగు నచ్యుతుండే నన్నిటుల ననుగ్రహించె నని భక్త్యా
విష్టచేతస్కులై యచ్యుతాష్టకమున భగవంతుని స్తుతించుచుఁ
గాలటినుండి తరలి పాదచారియై యరణ్యమార్గమునఁ బోవుచు,
గోకర్ణమను క్షేత్రమున వారి సహాధ్యాయులగు విష్ణుశర్మను సంధిం
చి వారిని వెంటఁగొని గ్రామైకరాత్రముగ దూరప్రయాణమును సలిపి
కొంతకాలమునకు నుజ్జయినీ పురంబు సమీపంబున నర్మదానదీ తీర

ముననున్న యమరేశ్వరంబను నగరంబుఁజేరి యచ్చట భర్తృహరి మొదలగు శిష్యులతోఁ బరివేష్టితులై యున్న శ్రీ గౌడపాదాచార్యులవారి శిష్యులగు శ్రీ గోవిందభగవత్పాదులవారి సన్నిధానమున కేఁగి యమ్మహానీయుని సందర్శనంబున కెంతయు సంతసిల్లి పులకాంకిత గాత్రంబుతో సాష్టాంగ ప్రణామంబు లాచరించి తనవృత్తాంతముం దెలిపి ముముక్షుండగుఁ దన్నుం బ్రహ్మైకధ్యానరతుంఁడుగాఁ గరుణించి తత్త్వోపదేశంబుఁజేసి కృతార్థుంజేయఁ బ్రార్థించిరి.

గోవిందభగవత్పాదులవారు శంకరుల సహజ విద్యా వినయంబులకు సంతుష్టాంతరంగులై సంప్రదాయానుసారంబుగ తత్త్వమసీత్యాది మహావాక్యోపదేశంబుఁ గావించి సన్న్యాసు లెఱుంగవలసిన రహస్యాంశమ్ముల బోధించి క్రమసన్న్యాసం బనుగ్రహించిరి.

అనంతరము శంకరులు గురుకులవాసముఁజేయుచు సుమారు రెండు వత్సరంబు లద్వైతమత గ్రంథముల నితర శాస్త్రములను బూర్తిగ నభ్యసించి సర్వవిద్యా పారంగతులైరి. మఱియు నట్టి కాలములో శ్రీశంకరభగవత్పాదులవారు నర్మదాష్టకము, ప్రాతఃస్మరణము, సాధనపంచకము, యతిపంచకము, వాక్యవృత్తి, రాజయోగభాష్యము, నిర్వాణదశకము, వివేకచూడామణి, ఆత్మానాత్మ వివేకము, మాయావివరణము, పంచీకరణము మొదలగు గ్రంథములనుగూడ రచించిరి.

అంత నొక్కనాఁడు గోవిందభగవత్పాదులవారు శ్రీమదాచార్యులవారినిజూచి యిట్లనిరి. "వత్సా! నీవు సకల శాస్త్రంబులను వేదవేదాంతములను సాంగంబులుగ నభ్యసించి యాత్మతత్త్వంబు లెస్సగ నెఱింగితివి. కావున నద్వైతార్థ ప్రతిపాదకంబులగు వేదాంతసూత్రములకును, దశోపనిషత్తులకును, భగవద్గీతలకును భాష్యమును రచించి లోకోపకారము సేయుము"ని యాజ్ఞాపించి శ్రీ చంద్రమౌళీశ్వర విగ్రహంబును మఱియు రత్నగర్భ గణాధిప విగ్రహంబును శంకరుల కొసంగి యిట్లనిరి. "వీనిని బ్రథమమున నాదిగురుం

డగు పార్వతీవల్లభుం డద్వైత విద్యతోడ నారాయణునకొసంగె. అతనివలన వీనిం గ్రమంబున బ్రహ్మయు, వసిష్ఠుండును, శక్తియు, పరాశరుండును, వేదవ్యాసుండును, శుకుండును, గౌడపాదాచార్యులవారును బడసిరి. వారివలన నేను వడసితిని. వీనిని బూజించుచు నద్వైత విద్యను జనులకు బోధించుచు దేహయాత్ర గడపుము” నియానతిచ్చిరి.

అంతట శ్రీమదాచార్యులవారు గోవిందభగవత్పాదులవారియొద్ద నభ్యసించిన గ్రంథములపైకి శ్రీగౌడపాదులవలన రచింపఁబడిన మాండూక్యకారిక యను గ్రంథము, వేదాంతరహస్యమును కరతలామలకంబుగ బోధించుటవలన నా కారికకు భాష్యమును వ్రాయనుద్దేశించి శ్రీగౌడపాదులవారి యనుమతినిం బొందుటకై వారి సన్నిధానమునకుం బోవ నపేక్షించిరి.

అనంతరము గోవిందభగవత్పాదులవారు శంకరులను బదరికాశ్రమముననున్న శ్రీగౌడపాదాచార్యులవారి సన్నిధానమునకుం గొనిపోవుటయు, శంకరులు నూటయిరువది సంవత్సరముల ప్రాయము గలిగి వయోవృద్ధులై బ్రహ్మనిష్ఠయందున్న శ్రీగౌడపాదాచార్యులవారిని సందర్శించి మిగుల సంతుష్టాంతరంగులై వారికి ప్రణమిల్లి తమరాకకు కారణము నివేదించిరి. శ్రీగౌడపాదాచార్యులు శంకరులను తమశిష్యులనుగా నంగీకరించి వారికద్వైతవిద్యను బూర్తిగ బోధించునట్లు సెలవిచ్చినదేకాక మాండూక్యకారికకు భాష్యము రచించుటకును ననుజ్ఞ నొసంగిరి.

శ్రీమదాచార్యస్వాములవారు శ్రీగౌడపాదాచార్యులవారి సన్నిధిని వేదాంతగ్రంథ కాలక్షేపముఁజేయుచు వేదాంతవిషయములగు షట్పది, శ్రీమన్నారాయణస్తోత్రము, హరిమీడేస్తోత్రము, వేదాంతకేసరి యను శతశ్లోకి, స్వాత్మనిరూపణము, పరమార్థసారసంగ్రహము, మొదలగు గ్రంథముల నా సమయంబున రచించినదేకాక మాండూక్యకారికకుఁగూడ భాష్యమును వ్రాసిరి. ఆభాష్యమును

శ్రీగౌడపాదులవారు పరికించి యానందకందళిత హృదయార
విందులై ప్రస్థానత్రయమునకు సహితము భాష్యములను రచించి
యద్వైతవిద్యా ప్రభావమును భూమండలమున ప్రకటింపుమని
శాసించిరి.

శ్రీశంకరభగవత్పాదులవారు బదరికాశ్రమమున శ్రీగౌడ
పాదాచార్యుల సన్నిధానమున వేదాంతగ్రంథకాలక్షేపము చేయు
చు వచ్చినకాలమున ప్రస్థానత్రయమునకు షోడశభాష్యములనగా,
భగవద్గీత, విష్ణుసహస్రనామస్తోత్రము, సనత్సుజాతీయము, అను
మూఁడు గ్రంథములకు భాష్యములనువ్రాసి, పిదప నీశావాస్య,
కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ,
ఛాందోగ్య, బృహదారణ్యకము లను దశోపనిషత్తులకును, శ్వేతాశ్వ
తర, నృసింహతాపిని యను మఱిరెండు యుపనిషత్తులకును భాష్య
ములను రచించి యనంతరము వేదాంతసూత్రములకుఁగూడ మిగుల
విపులమగు భాష్యమును నిర్మించిరి. వేదాంత సూత్రములకు భాష్య
ములు పెక్కులు గలవు. వానియందు శంకరులవారి భాష్యమే
మిగుల ప్రసిద్ధికెక్కినది.

శ్రీగౌడపాదాచార్యులవారు శంకరులు వ్రాసిన భాష్యము
లను జూచి యమితానందముంజెంది శంకరులను కైలాసపర్వతమున
తపముజేయుచుండిన గౌడపాదాచార్యులవారి గురువులగు శుక
బాదరాయణుల సన్నిధానమునకుఁగొనిపోయి యాభాష్యములను
నితర ప్రకరణ గ్రంథములను వినిపించిరి. శంకరు లాయిరువురు
మహర్షియుల గనినంతన ధన్యాష్టకమును రచించి తమ మనోభావము
ను వ్యక్తపఱచుటయు, నాపూజ్యచరణు లిరువురు శంకరులు రచిం
చిన గ్రంథములనెల్లఁ జూచి మిగుల సంతృప్తహృదయులై వారిని పరి
పూర్ణ కృపతో నాశీర్వదించి వ్యాఖ్యానసింహాసనాచార్యా ద్యనేక
బిరుదముల నొసంగి విద్యాస్థానమగు కాశీక్షేత్రమునకుఁ జని యద్వై
త విద్యను జనులకు బోధించియు, వేద విరుద్ధములగు మతములను

దర్శనములను ఖండించియు, నద్వైతమత స్థాపనంబుఁ గావింపు మని యాజ్ఞాపించి యదృశ్యులై మహాకైలాసంబుఁజేరిరి. వారిని కైలాసంబునకుఁ గొనిపోయిన గౌడపాదులును నదృశ్యులైరి.

అట్టులామువ్వురు మహనీయు లేకకాలమున నదృశ్యులగుటంగాంచి యానిర్జన ప్రదేశమున శ్రీశంకరభగవత్పాదులవారు నిర్విణ్ణమానసులై బ్రహ్మనిష్ఠంబూని యాత్మబంధ విమోచనంబుఁ గావింప కైలాసనాథుండగు మహేశ్వరుని ధ్యానింపఁగా నాది గురుండగు నాభక్తవత్సలుం డొక వటవృక్షంబుక్రింద వాసుదేవ, బాదరాయణ, శుక, గౌడపాదాది మహనీయులతోఁ బరివేష్టింపఁ బడి యమృత కలశముతోడను, జపమాలతోడను పుస్తకపాణియై చిన్ముద్ర ధరించి దక్షిణామూర్తి స్వరూపంబున శంకరులకు దర్శనం బొసంగె.

అంతట శంకరులు భగవంతుని వీక్షించి యతని పాదపద్మములపై శిరంబిడి ప్రణమిల్లి దక్షిణామూర్తిస్తోత్రమును రచించి స్తుతింపఁగా పార్వతీవల్లభుండు సంతుష్టుండై శంకరుల భక్తికి మెచ్చి వారికధ్యాత్మ సన్యాసము ననుగ్రహించి తనహస్తమున నున్న సూత్రభాష్యముల నిచ్చి యా భాష్యార్థములను బ్రజలకు బోధించుచు నద్వైతవిద్యను బ్రకటింపుమని నియోగించి నదేకాక శంకరులను నిజధామంబగు మహాకైలాసంబునకుఁ దోడ్కొనిపోయి యోగలింగము, భోగలింగము, వరలింగము, ముక్తిలింగము, మోక్షలింగము ను పంచ స్ఫటికలింగముల నొసంగి సౌందర్యలహరి యను మంత్రసరస్వతిని సహిత ముపదేశించెను.

శ్రీ శంకరులవారు కైలాసంబున నవరత్నఖచితమగు కనక సింహాసనముమీఁద పార్వతీసమేతుండును, త్రిపుండ్రాంకిత మస్తకుండును, చతుర్భుజుండును, త్రినేత్రుండును, నాగాభరణ భూషితుండును, జటాజూటుండును, గంగాధరుండును, చంద్రశేఖరుండును, భస్మోద్ధూళిత విగ్రహుండును, రుద్రాక్షమాలా భరణుండును, వ్యాఘ్ర

చర్మాంబరధారియు, డమరుకహస్తుండును, మృగధరుండును, వరదాభయహస్తుండును, నిఖిల సురాసురార్చిత చరణకమలుండును, కోటి సూర్య ప్రకాశుండును, దివ్యభోగ సమన్వితుండును, సచ్చిదానంద స్వరూపుండును నగు మహేశ్వరుంగాంచి బ్రహ్మానంద భరితులై శివపాదాది కేశాంత వర్ణనస్తోత్రము, శివకేశాది పాదాంత వర్ణన స్తోత్ర మను రెండుస్తోత్రములను గావించినదే కాక, ఆత్మభుజంగము, స్వానుభూతియను నద్వైత గ్రంథములనుకూడ రచించి లోకోద్ధరణార్థము హరీ మర్త్యలోకమున నెఱవేర్పందలంచిన మహాత్కార్యములయందు దృష్టినుంచి మహేశ్వరుం డొసంగిన స్ఫటికలింగముల ను దీసికొని భగవంతుని వీడ్కొని మఱల బదరికాశ్రమంబుం జేరి యచ్చట వారిరాకను నిరీక్షించుచున్న విష్ణుశర్మకు కైలాసపర్వతమును మహాకైలాసమునను జరిగిన వృత్తాంతంబెల్ల నెఱింగించిరి.

అంతట విష్ణుశర్మ యధ్యాత్మ సన్యాసక్రమమును దనకుం దెలిపి తన్ను శిష్యునిగా గ్రహింపుమని సవినయుండై వేడుటయు, శంకరులు తత్క్షణమే యధ్యాత్మవిద్య సన్యాసవిధి, వేదాంతడిండిమ మను గ్రంథములను రచించి యధ్యాత్మ సన్యాస క్రమమును వేదాంతరహస్యమును జక్కఁగఁ దెలిపి వారికి సన్యాసంబిచ్చి చిత్సుఖాచార్యులని నామధేయం బొనర్చి మహావాక్య వివరణంబను గ్రంథము సహా వ్రాసి మహావాక్యోపదేశంబుఁ గావించి వారిని శిష్యులనుగా నంగీకరించిరి.

పిదప నుభయులు నచ్చటికి తమతో నేతెంచిన శ్రీగోవింద భగవత్పాదులవారి సన్నిధానంబునకేగి వారియనుజ్ఞనుబొంది కాశీ నగరమునకుం దరలుటకు నుద్యుక్తులైరి.

ఇంతలో శంకరుల బంధువగు నగ్నిశర్మ యచ్చటి కేతెంచి యార్యాంబ పంపిన ద్రవ్యమును శంకరుల కొసంగి యామె దేహరుగ్మతచేఁ బీడింపఁబడుచున్నదని నివేదించెను. అంతట కాశీ ప్రయాణమును నిలిపి తల్లిపంపిన ద్రవ్యముతో బదరికాశ్రమమున

నున్న శ్రీమన్నారాయణుని యాలయమును బాగుపఱచి, యలకనంద లోఁబడియున్న నారాయణ విగ్రహమును వెలుపలఁగొనివచ్చి స్వస్థానమున నాలయములోఁ బ్రతిష్ఠించి తత్పూజా నైవేద్యాది కైంకర్యములకు నగ్నిశర్మను నచ్చట నిలిపిన దేకాక గౌడపాదులవారి యాశ్రమమునకు సమీపమున స్నానయోగ్యముగా నుష్ణోదక సరస్సు నొకదాని నిర్మాణముఁజేసిరి. ఆ సరోవరం బిప్పటికిని శంకరపుష్కరిణి యని ప్రఖ్యాతింగాంచియున్నది.

అనంతరము శంకరులు చిత్సుఖులతోడ బదరికాశ్రమమునుండి బయలుదేరి కాలటింజేరి యాశ్రమమర్యాద కనుగుణంబుగఁ దల్లిని సమీపించి ప్రణమిల్లి యామెకు శుశ్రూషలు సలిపిరి. అంతట నార్యాంబ మిగుల సంతుష్ట హృదయయై తనయునింజూచి "నాయనా! నేనిఁక స్నానార్థము నదికి నడచి పోఁజాలను. మఱియు నదీ స్నానమును మానుటకొప్పను. ఇందుకు సదుపాయం బాలోచింపుమ"ని చెప్పుటయు శ్రీశంకర భగవత్పాదులవారు తల్లియొక్క నైష్ఠికతను దద్విరుద్ధంబగు వార్ధక్యమును గమనించి గంగాధరుండగు మహేశ్వరుని బ్రార్థింప నా భక్తాభీష్టప్రదుండు కరుణించి యాచూర్ణినదీ ప్రవాహమును వారియింటి సమీపమునఁ జేర్చెను. అది మొదలా సరిద్వరం బంబానది యని ప్రసిద్ధింజెందెను.

కొన్నాళ్లి కార్యాంబకు దేహాయగ్మత యతిశయింప శంకరులను బిలిచి "నాయనా! నాకవసానకాలము సమీపించినది. నేనిఁక బ్రతుకను. నాకు జన్మరాహిత్యంబు గావించు తత్త్వోపదేశముఁ జేయుమని యడిగెను.

అనంతరము శంకరులు స్వరచిత తత్త్వబోధం బను గ్రంథము నందలి యంశంబులఁ జెప్పసాగిరి. ఆయంశము లప్పటి యామె దేహస్థితినిబట్టి బుద్ధికి గోచరింపకుండుటచే నాయమ శ్రీ కృష్ణపరమైన ధ్యానశ్లోకములఁ జెప్పుమని కోరెను.

వెంటనే శంకరులు కృష్ణాష్టకమను స్తవమును రచియించి

తల్లికి వినిపించిరి. అంతట నామె కృష్ణమూర్తిని ధ్యానించుచు పాంచభౌతికమగు నీ శరీరమును వదలి పరమపదము నొందెను.

శంకరులు తల్లికడ వఱకుఁ దెల్పియుండినరీతిగా కేరళ దేశాచార ప్రకారము వారియింటి దొడ్డిలో నొకమూల చితినిబేర్చి తల్లి మృత కళేబరమునందుంచి యగ్నిసంస్కారంబుఁ గావించి యుత్తర క్రియల ను యథాక్రమముగ నెఱవేర్చిరి.

అత్తఱి, అహోబిల క్షేత్రవాసులగు సనందనులనువారు ప్రయాగక్షేత్రములోఁ బ్రభాకరాచార్యులను వారియొద్ద పూర్వమీ మాంసాభ్యాసముఁ జేయుచుండి వారియుపదేశము తమమనస్సున కుఁ దృప్తిలేక యధ్యాత్మవిద్య నభ్యసింపఁ దలఁచియుండఁగా శ్రీలక్ష్మీ నృసింహమూర్తి వారికి స్వప్నములోఁ గనఁబడి శంకరుల కడ కేగ నాజ్ఞఁజేసిరి. ఆ యాజ్ఞానుసారము శంకరులను వెదకుచు బదరి కాశ్రమమునకుఁబోయి శ్రీమదాచార్యులవా రచ్చట లేరని మెఱింగి యచ్చటనుండి యస్వస్థతతో మఱలిన గోవిందభగవత్పాదులవారిని నమరేశ్వరముఁజేర్చి శంకరుల సన్నిధానంబుఁ జేరి గోవిందభగవత్పా దుల యనారోగ్యతం దెల్పి వారు శంకరులఁ జూచు నపేక్షతో నున్న వారని విన్నవింపఁగా శంకరులు సనందనులరాకకుఁ గారణంబు నెఱిం గి వారిని శిష్యులనుగా గ్రహింపఁదలఁచి చిత్సుఖులవారిని సనందను లను వెంటఁదీసికొని కాలటి యగ్రహారమును వదలి నర్మదా తీరమున నున్న యమరేశ్వరమువచ్చి చేరిరి.

అంతట శంకర భగవత్పాదులవారు నర్మదా మధ్యనుండు మాంధాత ద్వీపమున వైడూర్యమణి పర్వతముమీఁద జ్యేష్ఠకుమా రుఁడును శిష్యుఁడు నగు భర్తృహరి మొదలగు శిష్యులతోఁ బరివే ష్టింపఁబడి యస్వస్థతతో నున్న గోవిందభగవత్పాదులవారి సన్నిధా నముఁజేరి తమరాకను నివేదించుటయు, గోవిందభగవత్పాదులవారు శంకరులనాలింగనముఁజేసికొని దిగ్విజయార్థము బయలువెడలి యద్వై త విద్యను భరతఖండములో నలువైపులఁ బ్రచురపఱుపుమని వారి

కాజ్ఞాపించి తమ శిష్యులకు తురీయాశ్రమ ధర్మముల నుపదేశించి శంకరుల కొప్పగించి ప్రణవము నుచ్చరించుచు యుధిష్ఠిర శకము 2646 కు సరియయిన క్రీ. ముం. 494 లో కార్తికశుద్ధ పున్నమ దినమున బ్రహ్మైక్యమును బొందిరి.

గోవిందభగవత్పాదులకు బూర్వాశ్రమమున క్షత్రియ స్త్రీ వలనఁ గలిగినవాఁడును నుజ్జయినీ చక్రవర్తియు నగు శ్రీహర్ష విక్రమాదిత్యుఁడు గోవిందభగవత్పాదులవారు సిద్ధినొందిరని విని వెంటనే మాంధాతృద్వీపమునకేగి వారి సమాధిస్థలమున నోంకారనాథులపేర నొక దేవాలయము నిర్మించెను. ఆక్షేత్ర మిప్పటికిని బుణ్యస్థలములలో నొక్కటిగ నెన్నఁబడుచున్నది.

గోవింద భగవత్పాదుల యుత్తరక్రియలు పూర్తియయిన పిదప సనందనులు శంకరుల చెంతఁజేరి యాత్మతత్త్వమును బోధింపుమని ప్రార్థించుటయు నాచార్యులవారు సనందనులకు సన్యాసంబిచ్చి శిష్యులనుగాఁజేసికొని "ఆత్మబోధము"ను గ్రంథము రచించి సనందనాది శిష్యులకు నాత్మతత్త్వమును బోధించిరి. ఈ సనందనులకే పద్మపాదాచార్యులను నామధేయంబుగూడ కలదు.

అనంతరము శంకరులు శిష్యులతోడ దిగ్విజయార్థంబు మాంధాతృ ద్వీపమునుండి బయలువెడలి ప్రయాగక్షేత్రంబుచేరి త్రివేణి యనంబడు గంగా, యమునా, సరస్వతీ నదుల సంగమస్థానమున శిష్యులతోడ స్నానంబొనర్చి యాహ్నికములను దీర్చికొని భరద్వాజాశ్రమమునకుఁజని యచ్చట కొంతకాలము నివసించియుండి యద్వైత విద్య నచ్చోట శిష్యులకు బోధించుచుండిరి. ఈభరద్వాజాశ్రమ మిప్పటికిని జాల ప్రసిద్ధికెక్కియున్నది. ఇచ్చోటనే శ్రీరాముల వారు చిత్రకూటంబునకుఁబోవు దారిలో వానరసైన్యముతో విడిసిరి. ఈయెడనే బుద్ధదేవుఁడు క్రీస్తుపుట్టుటకు సుమారు 1800 సంవత్సరములకు ముందు ధర్మోపదేశము చేసెను. ప్రకృత మచ్చోట నాస్థల ప్రభావముచే నలహాబాదు సర్వకళాశాలయు గవర్నమెంటు విద్యా

లయమును విద్యార్థులు నివసించు భవనములును వారికి భుజింప ననుకూలం బగు స్థలములును నేర్పఱుపఁ బడియున్నవి.

శ్రీమదాచార్యులవారు భరద్వాజాశ్రమమున శిష్యుల కద్వైతవిద్యను బోధించుచుండఁగా వారి పాండిత్యమును విని వేదాంత గ్రంథకాలక్షేపము కొఱకు నానాదేశంబులనుండి విద్యార్థులు వచ్చి చేరిరి. మఱియు నాకాలమున శంకర్యులు ప్రయాగాష్టకము, యమునాష్టకము, మాధవాష్టకము, సోమేశ్వరాష్టకము, లక్ష్మీనృసింహ పంచరత్నము మొదలగు గ్రంథములనుగూడ రచించిరి.

అంత శంకరభగవత్పాదులవారు ప్రయాగక్షేత్రములోనుండు నక్షయవటముం జూడఁగోరి శిష్యులతోఁడ నొకనాఁడా చెట్టుకడకుఁ బోయిరి. అప్పుడా వృక్షముక్రింద నొక బ్రాహ్మణబాలుఁడు కుష్ఠరోగమువలన శరీరము తెల్లవాఱి గుడ్డగూబవలె నేత్రదృష్టి సహితము తప్పినందున నాయవమానమును సహింపఁజాలక ప్రాణత్యాగంబు సేయ నిశ్చితుఁడై యుండి దైవవశమున శంకరులను జూచి తన సంకల్పమును మాని "ఓ యతి సార్వభౌమా! కృపఁజేసి దీనుఁడగు నన్ను రక్షింపుము" అని వారి పాదపద్మములపైఁబడి ప్రార్థించెను.

శంకరులు కరుణా సముద్రులగుటంజేసి యంతట తమ కర పల్లవములతో నా బ్రాహ్మణబాలుని స్పృశించి లేవనెత్తిన మాత్రమున నతఁడు కుష్ఠరోగ విముక్తుఁడై నేత్రపటుత్వము నందఁగలిగి మిగుల లావణ్యశరీరము గలవాఁడయ్యెను. జనులందఱు వానిని "ఉదంకుఁడు" అనఁగా, కుష్ఠుమానినవాఁడని పిలువసాగిరి. అనంతర మాతఁడు తన్ను శిష్యునిగా స్వీకరించి యాత్మతత్త్వమును బోధింపుమని వేఁడుటయు, శంకరు లతని యోగ్యతను కనిపెట్టి యతనికి గురువునెడఁ గలిగిన యవిశ్వాసమువలన వ్యాధి తటస్థించెనని యెఱింగి వెంటనే యాతనికి సన్యాసంబిచ్చి యుదంకుఁడని నామధేయం బొసంగి మహావాక్యోపదేశంబుఁగావించి శిష్యునిగా గ్రహించిరి.

మఱికొన్ని దినములకు శ్రీమదాచార్యులవారు శిష్యులతో

డఁ బ్రయాగక్షేత్రమునకు సమీపముననున్న ప్రతిష్ఠానపురికిఁ జేరిన శ్రీపల్లి యగ్రహారమనఁగా, దారాగంజికిన్ని అలహాబాదు కోట కున్ను నెదురుగా ప్రకృతము * జఌషియనంబడు నగ్రహారమునకు విజయముఁ జేసిరి.

ఆ యగ్రహారములో నివసించియుండిన కర్మానుష్ఠానపరుండును కుమారిలభట్టాచార్యులవారి శిష్యుండును నగు ప్రభాకరాచార్యులు, శంకరుల రాకను విని వారిని కర్మమార్గమునఁ ద్రిప్పఁదలఁచి తన మతావిష్టులను వెంటనుంచికొని శంకరులను సమీపించి పూర్వమీమాంసాశాస్త్ర పద్ధతి ననుసరించి కర్మప్రాశస్త్యమును గుఱించి యుపన్యసింపసాగెను. శంకరులు కొంతతడవు వారియుపదేశమును విని కర్మానుష్ఠానము చిత్తశుద్ధిని తన్మూలమున భక్తిని తద్ద్వారా జ్ఞానమును సాధించునట్లున్న దేగాని మోక్షమునకు జ్ఞానమే సాక్షాత్సాధనంబగుటంబట్టి కేవలము కర్మాచరణమువలన మోక్షము సిద్ధింపదని పూర్వపక్షముచేసి వారినోడించిరి. పిదప ప్రభాకరాచార్యులును వారిశిష్యులును, వారిమతస్థులును శంకరుల మతము నవలంబించి వేదాంతులైరి.

ప్రభాకరాచార్యు లుదంకుని వృత్తాంతంబు విని యత్యాశ్చర్య సంతోషాక్రాంతస్వాంతులై యేడవ సంవత్సరము మొదలు మౌనముఁదాల్చి యితరులతోఁ బలుకకయు నాహార విహారముల యందిచ్ఛ లేకయు నుండెడు పృథివీధరుండను తన కుమారుని శంకరుల సన్నిధానంబుఁజేర్చి యతని జాడ్యము మాన్పఁ బ్రార్థించిరి. శంకరులా బాలుని పూర్వవృత్తాంతమునుబట్టి యతఁడు బ్రహ్మయోగియని నిశ్చయించి కరుణాకటాక్ష వీక్షణములతో నాబాలు వీక్షించి సమీపమునకుఁబిలిచి తమకరపల్లవముల నాబాలుని శిరస్సున నిడి "నీవెవ్వఁడవు? ఎందుండి వచ్చితివి? నీరాకకుఁ గారణంబేమి?" యని

* జఌషియనఁగా, హిందూస్థానిలో నగ్ని దగ్ధమైనదని యర్థము. ఆయగ్రహార మగ్ని దగ్ధమైనందున నాపేరు గలిగె.

యతనుగుట్టయు, నాబాలుండు శంకరులతో నద్వైత కథనంబునకుం బూని యాత్మతత్త్వమును కరతలామలకంబుగం బ్రదర్శించి తన్ను శిష్యునిగా గ్రహింప వేఁడెను.

తనయుని యద్భుత ప్రసంగమును నాచార్యుల యసాధారణ ప్రజ్ఞయుఁజూచి ప్రభాకరాచార్యులు తనకు సన్యాసం బనుగ్రహించి యద్వైతవిద్యను బోధింపుమని యాచార్యులఁ బ్రార్థించిరి. శంకరులు తత్త్వోపదేశమను గ్రంథము వ్రాసి ప్రభాకరుల కుపదేశించిరి. అంతట ప్రభాకరాచార్యులు సన్యసించి యది మొదలుగ వేదాంత శాస్త్ర ప్రవర్తకులైరి. మఱియు వారి కుమారుఁడగు పృథివీధరున కు శంకరులు సన్యాసంబిచ్చి యాత్మతత్త్వమును కరతలామలకంబుగ దెల్పినందున హస్తామలకులని నామధేయం బొసంగి వారిని పరమహంస యోగిఁగా నిర్ణయించి శిష్యులనుగా నంగీకరించిరి.

అనంతర మొక్కనాఁడు శంకరులు ప్రయాగక్షేత్రమునకుం బడమట నూఱుమైళ్ళ దూరమున యమునాతీరముననున్న "కౌశాంబి" (ప్రకృతము కోసమనంగల) నగరమునకు విజయముచేసి, యచ్చట నొక వృద్ధ బ్రాహ్మణుని కుమారుఁడు యౌవనవంతుఁడై యుండి యాకస్మికముగా మరణించుటచే వృద్ధమాతాపితలు దుఃఖాక్రాంతులై శవాకారముననున్న తనయుని సమీపించి విలపించుచుండుటను జూచి, వారిదుఃఖమును బోఁగొట్టనెంచి వారు సర్వశక్తిమంతులుగాన తమ కమండలూదకము నా శవశరీరంబుపైఁ బ్రోక్షించిన మాత్రమున, న విప్రకుమారుండు నిద్రించి మేలుకొన్నవాని చందంబున లేచి శంకరుల పాదపద్మములకు నమస్కరించి యంజలిబద్ధుఁడై యనేకవిధంబుల నుతింపఁ దొడంగె. అంతట నాబాలుని తల్లిదండ్రులు సంతోషసాగరమగ్నులై శ్రీమదాచార్యులవారికి తమ కృతజ్ఞతను నివేదించిరి. ఆ నగరవాసులు సహితము శంకరుల యద్భుత మహిమమును నమానుష ప్రజ్ఞను గని వారిని గొనియాడిరి.

ఇట్లుండ నొక ప్రాతఃకాలమున శంకర భగవత్పాదులవారు

శిష్యులతోడ త్రివేణీతీరమున నున్న యొక కానుగు వృక్షము నీడను గూర్చుండియున్న తఱి, కర్మమార్గ ప్రవర్తకుండును జైనమత ఖండనుండు నగు కుమారిలభట్టాచార్యులు తుషాగ్ని ప్రవేశము జేయఁదలఁచియుండు వృత్తాంతముం దెలిసి శంకరులు ప్రయాగక్షేత్రమునకు సమీపముననున్న భద్రసేనుని రాజ్యమునకుఁ జేరిన రుద్ధపురమున కేగి తుషాగ్నియందున్న కుమారిలభట్టాచార్యుల సమీపించి "ఓవిప్రశ్రేష్ఠా! ఆత్మహత్యఁ జేసికొనవలదు. నా కమండలూదకమున నగ్నిని జల్లార్చెద. నాయొక్క భాష్యమునకు వివరణముగావింపుమ"ని చెప్పుటయు కుమారిలభట్టాచార్యులు వీరిని శంకరులని తెలిసి వినుతించి "స్వామీ! నేను జైనమత రహస్యమును గూఢముగా గ్రహించి తదనంతర మామత ఖండనముఁ జేసినందున నాకుఁ బ్రాప్తించిన గురుద్రోహ పాతక నివృత్త్యర్థము తుషాగ్నియందుఁ బ్రవేశించితి. నా సంకల్పము నెఱవేఱనిమ్ము. మఱియు మగధరాజధానియగు మాహిష్మతీపురమున సకలశాస్త్ర విశారదుండును నాశిష్యుండు నగు మండనమిశ్రుండు గలఁడు. మీభాష్యమున కతఁడు విపులముగ భాష్యమొనర్పఁ గలఁడని ప్రత్యుత్తరంబిచ్చి తారకమంత్రమును జపించుచు షణ్ముఖముద్రనుబూని శరీరమును బ్రహ్మరంధ్రముద్వారా త్యజించి క్రీ. పూ. 494 లో బ్రహ్మలోకముఁ జేరిరి.

అనంతరము శంకరులు కాశీక్షేత్రమునకుఁజని విశ్వేశ్వర సందర్శన మొనర్చి యావిద్యాస్థానమున మణికర్ణికా ఘట్టమున నావాసంబు గావించి యందలి విప్రులకు తమ భాష్యము నుపదేశించుచుండఁగా నొక దివసమున నాక్షేత్రవాసియగు విశ్వనాథాధ్వరి పుత్రుండైన కళానాథుండను విప్రుండు శ్రీమదాచార్యులవారి సన్నిధిఁజేరి మనోహరంబులగు తోటకవృత్తంబులతో నాచార్యుల స్తుతించి శుశ్రూషాదులచే వారి యనుగ్రహంబునకుఁ బాత్రుండగుటఁ జేసి శంకరు లతనికి సన్యాసంబిచ్చి శిష్యునిగా గ్రహించి యద్వైతవిద్యను బోధించి తోటకాచార్యులని నామధేయం బొనర్చిరి. వీరికే యానం

దగిరి యను నామధేయంబు గూడ కలదు.

ఇట్లు శ్రీమదాచార్యులవారు కాశీక్షేత్రమునందు నివసించి యచ్చట ప్రబలియుండిన శైవ పాషండమతమును ఖండించి యద్వైత విద్య నచటి జనులకు బోధించుచుండు సమయమున, ముముక్షునగు నొకానొక వృద్ధబ్రాహ్మణుఁ డాత్మతత్త్వము నెఱుంగక వ్యాకరణ సూత్రములను బలుమాఱు పల్లించుచుండుటం గాంచి యాత్మస్వరూపానుసంధానమును గలుగఁజేయు "శ్రీగోవిందద్వాదశమంజరికా" స్తోత్రమును రచించి యావిప్రున కుపదేశించి యతనిఁ గృతార్థునిగాఁజేసిరి.

అంతట శంకరు లొకనాఁడు మాధ్యాహ్నిక స్నానమునొఱకు మణికర్ణికా తీర్థమునకుఁబోవుచుండగా మార్గములో విశ్వేశ్వరుండు చతుర్వేదములను నాలుగు శునకరూపములతో వెంటఁదీసికొని చండాలస్వరూపంబుఁదాల్చి కాన్పించుటయు, నాచార్యుల శిష్యులా పంచముని దారితొలఁగి చనుమని యాజ్ఞాపించిరి. అంత నా చండాలుఁడు శంకరులనుజూచి "యతివరా! నీవు తొలఁగి చనుమని యాజ్ఞాపించు నది యీ పాంచభౌతిక జడశరీరమునా? లేక శరీరము యొక్క పంచకోశములలోపల బుద్ధిగుహలోఁ దాఁగియుండు చైతన్య స్వరూపుఁడగు ప్రత్యగాత్మనా? తెలుపుమ"ని పలుకఁగా, శంకరులు వానిమాటలకు మిక్కిలి సంతసించి యిట్లు పలికిన మనుజుఁడు కపట చండాలుఁడని నిశ్చయించి వానిఁజూచి "ఓధీరాత్మా! జీవుల విషయమై సమభావము వహించువారు లోకములో మిగులనరుదు. అట్లు ప్రపంచమందలి నానాప్రాణికోట్లయెడ సమభావముగలవాఁడు బ్రాహ్మణుఁడైనను లేక చండాలుఁడైనను నాతఁడే నాకాచార్యుఁడ"ను నర్థమును బోధించు "మనీషాపంచకము"ను రచించి వినుతించిరి.

శంకరుల గుణాతిశయంబునకు విశ్వేశ్వరుండు సంతృప్తుండై చండాలదేహమును ద్యజించి నిజస్వరూపమునం బ్రత్యక్షమై "వత్సా! నీవు నా యంశమున జనించినవాఁడవనుటకు సంశయంబులేదు. భేదవాదుల మతముల ఖండించి యద్వైతామృత వర్షం బెల్లయెడఁ

గుటిపింపుమ"ని యనుగ్రహించి యంతర్హితుండయ్యె.

పిమ్మట శంకరభగవత్పాదులు కాశీక్షేత్రమునఁ గొంతకాలము నివసించియుండి యచ్చట వ్యాపించియుండిన భైరవ, కాపాలిక, మల్లారి, వామాచార, ఉచ్ఛిష్ట గణపతి, భూతభేతాళ, చార్వాక, జైన, బౌద్ధాది పెక్కు దుర్మతముల ఖండించి తన్మతావలంబుల కద్వైత విద్యను బోధింపఁగా వారందఱు నద్వైతము నవలంబించిరి.

ఆకాలమున శ్రీమదాచార్యస్వాములవారితో నిరీశ్వరసాంఖ్యులు, అణువాదులగు వైశేషికులు, అభావవాదులగు తార్కికులు, ఇంకను పాంచరాత్రి పాశుపతాది భేద వాద మతములందలి ప్రముఖులందఱును వారివారి మత శాస్త్రమునుగూర్చి వాక్యార్థములు సలిపి తుదకుఁ బరాజితులై భగవత్పాదులవారి శిష్యులైరి.

ఇట్లు శంకరులా విద్యాస్థానమున నద్వైతమతస్థాపనంబుఁ గావించి శైవ, వైష్ణవ, శాక్త, గాణాపత్య, సౌర, కాపాలమతస్థులకుఁ గల భేదవాదములను ఖండించి పంచదేవతావిషయమైన యభేదోపాసనను బోధించినదేగాక సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము, ఉపదేశ సాహస్రి, అపరోక్షానుభూతి, అద్వైతకౌస్తుభము, అద్వైతానుభూతి మొదలగు నద్వైత గ్రంథముల రచియించియు కాశీ విశ్వనాథ స్తోత్రము, భవానీ భుజంగస్తోత్రము, అన్నపూర్ణాస్తోత్రము, సువర్ణమాలా స్తోత్రము, త్రిపురసుందరీ స్తోత్రము, చంద్రమౌళీశ్వర స్తోత్రము, శివానందలహరి, సౌందర్యలహరి మొదలగు స్తోత్రపాఠములను, గంగాష్టకము, మణికర్ణికాష్టకము, కాలభైరవాష్టకము, అంబాష్టకము, పాండురంగాష్టకము, శివాష్టకము, కామాక్ష్యష్టకము, మొదలగు నష్టకములను గావించియు, మహోపకారంబుసేసి లోకవిఖ్యాతిని బొందిరి.

శ్రీమదాచార్యులవారి శిష్యులగు సనందనులకు పద్మపాదులని నామాంతరము గలిగినందులకు చిన్న వృత్తాంత మొండుగలదు. అయ్యది యేదియన— శ్రీమదాచార్యులవారి శిష్యులలో సనందను

లవారు మిగుల సూక్ష్మబుద్ధిని నపార గురుభక్తిని గలిగియుండుటం జేసి యాచార్యులవారు లోకరీతిగా సనందనులయం దెక్కుడభిమానము ను వహించియుండిరి. ఈ కారణమువలన నితర శిష్యులు సనంద నులయెడ నసూయను వహింపసాగిరి. ఆచార్యులవారా సంగతి దెలిసి కొని, సనందనుల గురుభక్తిని మిగిలిన శిష్యులకుం దెలుపందలంచి యొక్కనాఁడు తమ సమీపమందున్న శిష్యునొక్కనింజూచి గంగా నది కావలితీరంబుననుండు సనందనులం దమయొద్దకుం గొనిరమ్మని యానతిచ్చిరి. తత్క్షణం బాశిష్యుఁడు నది సమీపంబుఁజేరి గంగాప్రవా హంబును దాటంజాలక గురుసన్నిధిం జేరె. ఆసమయమున దివ్య దృష్టిచే గురుసంకల్పము నెఱింగిన సనందనులు దుస్తరంబగు సంసా రమును సుఖంబుగఁ దరింపఁ జేయు నాచార్యుల యనుగ్రహము, నన్నీ నది నేల దాటింపదను దృఢమైన నమ్మకముతో నయ్యేటి వెల్లువ మీఁద నడువఁదొడంగిరి. అప్పుడు వారిగురుభక్తికి మెచ్చి భాగీరథి తన హస్తములఁబోలిన యలలచేఁ దనయందలి పద్మములను వారి పాదములక్రిందఁ జేర్చుచురాఁగా, సనందనులు నిరపాయముగ నదిని దాఁటి యాచార్యుల సన్నిధానంబుఁ జేరిరి. అట్టి యద్భుత చర్యం గనిన శిష్యవర్గంబు సనందనుల యెడఁ దమకుండిన యసూయను విడ నాడి, నాఁడు మొదలుగ యుక్తప్రవర్తనంబుఁ గలిగియుండిరి. ఈ కారణంబున నాఁటినుండి సనందనులు పద్మపాదులను నామంబునఁ గీర్తివహించిరి.

అనంతరము శ్రీ శంకరభగవత్పాదులవారు దిగ్విజయార్థము బయలు వెడలి కర్మబ్రహ్మవాది యగు మండనమిశ్రుని జయించి తమ భాష్యమునకు వార్తికమును జేయింపవలయునను కుతూహలముతో డ మగధదేశమునకు రాజధానియగు మాహిష్మతీ నగరమున రాజ స్థానములో ప్రధాన పండితులుగానున్న అభినవ చతుర్ముఖుఁడని ప్రసిద్ధిగాంచిన మండనమిశ్రుల గృహంబున కేగిరి. మండనమిశ్రుల విద్యాతిశయమును గుఱించి వారి మందిరమునఁ బంజరములలోని శుక

శారికలు సయితము పండితులు వాక్యార్థముఁజేయు తరుణమందు ప్రయోగించు మాటలగు "స్వతః ప్రమాణము, పరతః ప్రమాణము" అని పలుకుచుండునని జనులు చెప్పుకొనుచుందురు.

శ్రీశంకరులు మండనమిశ్రుల గృహమునకు వెళ్లిన తరుణమందు, వారు శ్రాద్ధకర్మ కుపక్రమించి వాకిలి తలుపును మూసియుంచిరి. ఆచార్యులవారట్టి తరుణమున లోపలికిఁ బ్రవేశించుటంజేసి, సన్యాసులు కర్మహీనులని వారియెడ మండనమిశ్రులకుండిన యసూయను బట్టియు ముఖ్యముగా శ్రాద్ధకాలములో వారేతెంచుటవలనను, మండనమిశ్రు లాచార్యులవారియెడ నాగ్రహపడినందుపై నుభయులకు విరసమగు సంవాదము తటస్థించినందున పితృయాగమును నెఱవేర్ప నేతెంచిన మహానీయులు వారి సంవాదమును శాంతపఱచిరి.

శ్రాద్ధకార్యానంతరము, శంకరులు వాక్యార్థమునకుఁ బూనుమని మండనమిశ్రులనుఁ గోరఁగా, వారందుల కంగీకరించి సరస్వత్యవతార మనంబడు మండనమిశ్రుల భార్యయగు భారతీదేవిని మధ్యవర్తినిగా నియమించుకొని, శంకరులు వాదములో సపజయమునొందినంతట, వారు గృహస్థాశ్రమమును స్వీకరింపవలసినదిగాను, మండనమిశ్రులోడినయెడల వారు సన్యసింపవలసినట్లును, శపథంబుఁజేసికొని చర్చకుఁ బ్రారంభించిరి.

మండనమిశ్రుల భార్యయగు భారతి సరస్వత్యవతారమనుట కొకయితిహాసము గలదు. పూర్వము బ్రహ్మలోకమున సభజరిగిన యొకసమయమందు దుర్వాసమహాముని వేదాధ్యయనముఁజేయు నవసరమున, కించిత్స్వరలోపముగా వీనులకుఁదోఁచిన దానికి సరస్వతీదేవి దుర్వాసునకు సయితము లోపము గల్గెఁగా, యని యమ్మునివరుంజూచి నవ్వెను. దుర్వాసులంతటఁ గోపించి యద్దేవి తన కొనరించిన పరిభవమునకుఁ గొంతకాలము భూలోకమున నివసింపవలసినట్లు శాపంబొసంగెను. అమ్మహర్షి శాప మమోఘముగాన, నద్దేవి యీమర్త్యలోకమున జన్మింపవలసివచ్చెను.

అట్లు సరస్వత్యంశ సంభూతురాలగు భారతిని మధ్యవర్తినిగా నియమించికొని యుభయులు బహుదినములు ప్రసంగించు చుండిరి. తుదకు మండనమిశ్రు లపజయముఁగాంచి సన్యాసంబు స్వీకరింపవలసివచ్చినందున, భారతి మండనమిశ్రుల యర్ధశరీర మగుటవలన తనతో సహితము వాదించి శంకరులు జయముఁబొందినఁగాని సంపూర్ణ విజయముగాదని యాసాధ్వీమణి యాచార్యులవారిని వాదమునకుఁ బిల్వఁగా నందులకు వారంగీకరించి యాదేవితో శాస్త్రచర్చ సేయ సమకట్టిరి.

శంకరులెంతకును వెనుదీయనందున వారు బాల్యముననే సన్యసించియుండుటంబట్టి వారికి కామశాస్త్ర పరిశ్రమంబుండదని తలఁచి వాణీదేవి కామశాస్త్ర వాదమునకుఁ బూనెను.

శంకరులు సర్వజ్ఞస్వరూపులై యుండియు నాదేవియొక్క ప్రశ్నంబునకు సమాధానంబిచ్చిన యెడల యతిధర్మంబునకు విరుద్ధంబుగ నుండునని తలఁచియు, మఱియు నాయాయాశ్రమంబులలోనుండు వారాయా యాశ్రమ ధర్మముల నతిక్రమింపఁగూడదను ధర్మమును దెలుప నుద్దేశించియు నాదేవియొద్ద నొక మాసము గడువుతీసికొని నర్మదాతీరముంజేరి యోగమహిమవలన తమ స్థూల శరీరము నొక వృక్షకోటరంబున నునిచి శిష్యులనుగావలియుంచి కాలవశమున మృతినొంది శ్మశానమునకుఁ దేఁబడిన యమరుకుండను రాజుయొక్క శరీరమందుఁ బ్రవేశించి యాశరీరమును కదలించిరి. అంతట నారాజు భార్యలు మొదలగు రాజబంధువులును, నారాజ్యమందలి జనులును రాజు బ్రతికెనని కడుసంతసంబంది యారాజును యథాప్రకారము నగరునఁజేర్చిరి. పిదప శంకరులా రాజశరీరముననుండి పరమనీతితో రాజ్యము సేయుచు రాజభార్యలతో గృహస్థధర్మములను సహితము నలుపుచు శృంగారరసయుక్తమగు నొకశతకమును రచించిరి. అమరకుని శరీరముతో శృంగారరసవత్తరమగు నా గ్రంథము రచింపఁబడినందున నది యమరుక శతకంబని వాడంబడుచున్నది.

ఇట్లుండ నొకనాఁడా రాజుయొక్క పట్టపుదేవియగు కనకమంజరి తనభర్తయొక్క యపూర్వమగు సమానుషప్రజ్ఞకు నాశ్చర్యం బంది తన పురుషుని కళేబరముఁ జొచ్చిన మనుజుఁడు మఱియొక మహనీయుఁడుగా నుండవలయునేగాని తనయజమానుఁడు కాఁడని తెలిసి, తన భర్తయగు నాతఁడు చాలకాలము బ్రతికియుండవలయునని యెంచి మంత్రులతో న్నాలోచించి యమ్మహాత్ముని కళేబరంబును పరిసరారణ్యములలో వెదకి దహింపుఁడని సేవకుల కాజ్ఞాపించెను.

ఈ వర్తమానము శంకరభగవత్పాదులవారి శిష్యులెఱిఁగి, వారు గాయక వేషంబుఁదాల్చి కడురయంబున నమరకుని పట్టణము న కేతెంచి రాజద్వారమున నిలఁబడి జరిగిన వృత్తాంతము శ్రీమదాచార్యులవారికి బోధయగునట్లు కొన్ని స్తోత్రములను బఠించిరి. శంకరులు వానిని విని తటాలున రాజకళేబరమును విడిచి పిచ్చుకరూపంబున గగనంబున కెగసి స్వశరీరమును జేరఁబోయిరి.

ఇంతలో రాజభటులు చెట్టుతొఱ్ఱలోనుండిన శంకరుల కళేబరమును దీసి చితిపై నుంచి నిప్పుపెట్టిరి. అట్టిసమయమున నాచార్యులవారు స్వశరీరముం బ్రవేశించి విష్ణుమూర్తియొక్క శరణంబుఁగోరి శ్రీ నృసింహస్వరూపమును స్మరించి స్తుతింపసాగిరి. ఈ స్తవము శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రమనియు, కరావలంబ స్తోత్రమనియును వాడంబడుచున్నది.

అంతట, కరుణానిధియగు భగవంతుండు ప్రత్యక్షుండై చితాగ్నిని శమింపఁజేసి తన కర పల్లవములతో నాచార్యుల మేను నిమిరి సుఖంబాపాదించి యంతర్ధానంబు నొందె.

అనంతరము శంకరులు మండనమిశ్రుల మందిరంబున కేగి భారతితో సంవాదంబునకు మఱలఁ బూనుకొని యాపతివ్రతా శిరోమణి యడిగిన ప్రశ్నలకెల్ల సమాధానములఁజెప్పి జయముఁ బొందిరి.

పూర్వము చేసికొనియుండిన ప్రతిజ్ఞ మేరకు మండనమిశ్రులు

సన్యాసంబుపూని సురేశ్వరాచార్యులను నామము వహించి తత్త్వోపదేశముచుబొంది క్రీ. ము. 491 లో శ్రీమదాచార్యులవారి శిష్యులైరి.

అంతట భారతి యీ మర్త్యలోకమును విడిచి బ్రహ్మలోకమున కరుగుటకుఁ బ్రయత్నింపఁగా శంకరులు భారతింజూచి "జగజ్జననీ! నేనుస్థాపింపఁబోవు పీఠములందు నెల్లపుడు నీసాన్నిధ్యముండునటుల ననుగ్రహింపుమ"ని ప్రార్థించుటయు, నాదేవి "యతీంద్రా! అట్లే నీ కోరిక నెఱవేర్చెద"నని ప్రత్యుత్తరంబిచ్చి నిజధామంబునకుఁ జనియె.

పిమ్మట శంకరు లచ్చటనుండి కదలి యాదేవిని ప్రతిష్ఠించుటకుఁ దగిన యుత్తమ ప్రదేశమును వెదకుచు, దక్షిణహిందూస్థానమున తుంగభద్రాతీరమున ఋశ్యశృంగమహర్షి యాశ్రమమనంబడు శృంగగిరిం జేరి యచ్చట నొక రమ్యస్థలంబున నాలయంబు నిర్మించి యొక్కసుముహూర్తంబున మంత్రశాస్త్రోక్త విధానంబున బీజాక్షరములతోడ శ్రీచక్రంబు లిఖించి శ్రీశారదాంబనందుఁ బ్రతిష్ఠించిరి. మఱియు నా గురు సార్వభౌము లచ్చట నొక మఠంబు నిర్మించి శారదాపీఠంబు రచియించి యాపీఠంబున సురేశ్వరాచార్యులను నియమించినదేకాక యామఠములో భోగలింగ చంద్రమౌళీశ్వరులను బ్రతిష్ఠించి రత్నగర్భగణపతి విగ్రహమునిచ్చి వానిని బరమభక్తితోఁ బూజించుచు నద్వైత విద్యను శిష్యకోటికి బోధింపుమని సురేశ్వరాచార్యుల కానతిచ్చి మఱియు తమయొక్క భాష్యములకు వార్త్తికముల రచియింపుమని యాజ్ఞాపించిరి.

సురేశ్వరాచార్యులు గురువుల యాజ్ఞానుసారము తైత్తిరీయ, బృహదారణ్యక భాష్యములకు వార్త్తికములను, దక్షిణామూర్తి స్తోత్రమునకు మానసోల్లాసంబను వార్త్తికంబును, నైష్కర్మ్యసిద్ధి మొదలగు ప్రకరణ గ్రంథములను రచియించిరి.

అనంతరము, శంకరభగవత్పాదులవారు శృంగగిరిలోఁ గొం

తకాలముండి యద్వైతమతబోధన చేయుచుండిన కాలమున స్వరచిత సూత్రభాష్యమునకు వ్యాఖ్యానంబుఁగావింపుమని పద్మపాదాచార్యుల కాజ్ఞాపించిరి. వారందులకు వ్యాఖ్యానము వ్రాయుచు గురువులవారి యనుజ్ఞ వడసి రామేశ్వరయాత్రకు బయలుదేరి స్వస్థలముఁ జేరి తనపినతండ్రియింటఁ గొంతకాలము నివసించియుండి రామేశ్వరమునకుఁ దఱలుచు వారురచించిన వ్యాఖ్యానమును పినతండ్రియింట భద్రపఱచిపోయిరి.

కర్మానుష్ఠానపరులగువారి పినతండ్రి యా వ్యాఖ్యానమును జదివి యందులోఁ దనమతమునకు విరోధములగు నంశములు మెండుగానుండినందున నా గ్రంథమును నగ్నిదేవునకుఁ బ్రీతిఁగావించిరి. పద్మపాదులవారు రామేశ్వరమునుండి మఱలివచ్చి పైవృత్తాంతము నెఱింగి మిగుల ఖిన్నులై తిరుగ గురువులవారి చెంతఁజేరి వారియనుగ్రహమున మఱల సూత్రభాష్యమునందలి పంచపాదములకు వ్యాఖ్యానమును, కడమ పదునొకండు పాదములకు వివరణమును రచియించిరి. ఆగ్రంథములు పంచపాదికయనియు, వివరణము లేక వృత్తియనియు ప్రపంచమున నిప్పటికిని బ్రసిద్ధింగాంచియున్నవి.

పద్మపాదులవారు తీర్థయాత్రంజేసికొని మఱల శృంగగిరిఁజేరిన వెనుక శ్రీమదాచార్యులవారు దిగ్విజయార్థము బయలువెడలి ప్రథమమున కేరళదేశముననున్న వానుకిక్షేత్రంబునకుఁ జని యందు నెలకొనియున్న కుమారస్వామిని సేవించి యందుండి మృడపురంజేరి యచ్చట వ్యాపించియుండిన బౌద్ధమతమును ఖండించి పిదప గోకర్ణంబున కరిగి మహాబలేశ్వరుని భజించి యనంతరము శ్రీశైలము, అహోబిలము మొదలగు పుణ్యస్థలంబులను గనుంగొనుచు నచ్చటచ్చటనుండు పండితులను జయించి తమ శిష్యులనుగా నొనర్చుకొనుచు పదంపడి మాళవదేశంబున కరిగి యుజ్జయినింజేరి యందుండు మహాకాళేశ్వరుని బూజించి యచ్చోటఁ బ్రబలియుండిన శాక్తమతమును ఖండించి యందుండి ఘూర్జరదేశమునకుఁ దఱలి సౌరాష్ట్ర

మునమున్న ద్వారవతిం జేరి శ్రీమహావిష్ణువును సేవించి యాద్వారవతీ
ప్రభువగు సుధన్వమహారాజునకు నద్వైతవిద్యను బోధించి యతనిని
శిష్యునిగాఁ బరిగ్రహించి యందొక మఠంబు నిర్మించి శారదాపీఠ
మును రచియించి యాపీఠమున పద్మపాదాచార్యులను నియమించి
పరంపరాప్రాప్తమగు శ్రీచంద్రమౌళీశ్వర లింగమును వారికొసంగి
దానిం బూజించుచు దురాచార ప్రవిష్టులను సన్మార్గమునకుం ద్రిప్పి
శిష్టపరిపాలనంబు గావింపుమని యాజ్ఞాపించిరి. ఈమఠం బిదివఱకుఁ
దగుశిష్యకోటితో వెలయుచుండె ప్రకృతము తన్మఠపాలనంబు వ్యవ
హారములచే క్షీణించియున్నదని తెలియవచ్చుచున్నది.

ఇట్లు శంకరదేశికేంద్రులు భూప్రదక్షిణంబుఁ గావించుచు,
నద్వైతం బుపదేశించుచు ద్వారకనుండి బయలుదేరి, బృందావనము,
కురుక్షేత్రము, నైమిశారణ్యము మొదలగు పుణ్యక్షేత్రములను గనుం
గొనుచు హరిద్వారంబునకుఁ జని బ్రహ్మకుండమున స్నానంబొనర్చి
శ్రీహరిని భజించి యందుండి మఱల బదరికాశ్రమమున కరిగి
శ్రీమన్నారాయణమూర్తిని సేవించి యా యాశ్రమమున జ్యోతిర్మ
ఠమను నొకమఠంబు నిర్మించి తోటకాచార్యులను దాని కధ్యక్షులను
గా నొనర్చి మఱియు నందు ముక్తిలింగ చంద్రమౌళీశ్వరులను బ్రతి
ష్ఠించి దానిని భక్తితోఁ బూజించుచు సాధుజనరక్షణంబు గావింపు
మని వారికాజ్ఞాపించిరి. ఈ మఠము ప్రకృతము తత్పరిపాలకు లెవ
రును లేకపోవుటచేత ఖిలమైనట్లు తెలియవచ్చుచున్నది.

అనంతరము, శ్రీమదాచార్యులవారు కేదారమునకుఁ జని
కేదారేశ్వరుని సేవించి యందుండి నేపాళమునకరిగి యచ్చటనుండు
పశుపతేశ్వరుని దర్శించి యాదేశాధిపతియగు వృషదేవవర్మ యొన
రించిన సత్కారంబులకు సంతసించి బౌద్ధమత ప్రముఖుఁడగు నా
ప్రభువునకు నద్వైతవిద్యను బోధించి యతనిని శిష్యునిగా గ్రహిం
చిరి. మఱియు నారాజు సంతానహీనుఁడై పుత్త్రి నపేక్షింపఁగా
శంకరులాతనికిఁ బుత్త్రికను కల్గునట్లనుగ్రహించిరి.

అట్లు శ్రీమదాచార్యులవారి యనుగ్రహమునలన నా రాజశ్రేష్ఠునకు జన్మించిన పుత్త్రునకు నా రాజేంద్రుండు శంకరవర్మ యని నామధేయంబొసఁగెను.

అంతట శ్రీశంకరభగవత్పాదులవారు వృషదేవవర్మయొక్క శివభక్తికి మెచ్చి యాక్షేత్రమున వరలింగ చంద్రమౌళీశ్వరులను స్థాపించి మఱియు నాభూపాలునకు శత్రుబాధరహితముగ రాజ్యసంపద గలుగునట్లాశీర్వదించి యందుండి బయలుదేరి యుత్తరహిందూస్థానమున సంచరించుచు నందుండు పండితుల నెల్ల జయించి యద్వైతమతమును వ్యాపింపఁజేసి కళింగదేశముననున్న జగన్నాథంబుఁజేరి యచ్చట భోగవర్ధనమను నొకమఠమును స్థాపించి హస్తామలకాచార్యులను తదధిపతులనుగా నియమించి యచ్చటనుండి వచ్చుమార్గమున "చెన్నై" యను పట్టణముననున్న చండిదేవియొక్క యుగ్రతేజము నాకర్షించి జనులభీతిని దొలంగించి యనంతరము చిదంబర క్షేత్రముం జేరెరి.

ఆక్షేత్రమున సకలవైభవోపేతుండై యున్న నటరాజస్వామి వారిని సేవించి సౌరమతమును ఖండించి యందు మోక్షలింగ చంద్రమౌళీశ్వరులను స్థాపించి యాక్షేత్రవాసులగు మూడువేల విద్వద్బ్రహ్మ మండలి సభ్యుల స్వాధీనముఁజేసి యందుండి శేషాచలంబునకుఁ జని యచ్చోట నెలకొనియున్న శ్రీవేంకటేశ్వరులను భజియించి వారిసన్నిధి కెదురుగా ధన జనాకర్షణ యంత్రంబు స్థాపించి శ్రీకాళహస్తి కరిగి శ్రీకాళహస్తీశ్వరుని సేవించి రామేశ్వరమునకుఁ దఱలిరి.

శ్రీ శంకరులు రామేశ్వరంబుఁజేరి యచ్చట సేతుస్నానముఁ గావించి శ్రీరామనాథస్వామివారిని దర్శనముఁజేసి యచ్చోటఁ బ్రబలియుండిన కాపాలికమతమును నిరసించి వక్రతుండపురి కరిగి గాణాపత్య మతమును ఖండించి యనంతరము మధురాపురంబునకుం జని సుందరేశ్వరుని సేవించి యందుండి జంబుకేశ్వరంబుఁజేరి యఖిలాండేశ్వరీ దర్శనముఁజేసి యాదేవియొక్క యుగ్రతేజంబును శాంతపఱచి శ్రీచక్రము నాదేవికి తాటంకములుగ సమర్పించి యటుపిమ్మట

ననంతశయనమునకుఁబోయి శ్రీమదనంతపద్మనాభుని భజియించి యచ్చటనున్న వైష్ణవ పాషండ మతమును ఖండించి శివకేశవులకు నామరూప భేదంబు దప్ప వస్తుభేదము లేదని బోధించి వారి మనంబునను0డిన భేదబుద్ధినిఁ దొలఁగించి వారినద్వైతమతము నవలంబింపఁజేసిరి.

పదంపడి శ్రీమదాచార్యులవారచ్చటనుండి బయలువెడలి దారిలో నద్వైత విద్యను బోధించుచుఁ జోళరాజ్యంబుఁజేరి కాంచీ నగరంబునకుఁజని దానింబాలించు చోళదేశాధీశుండగు రాజసేన మహారాజును గొని శ్రీవరదరాజస్వామివారికిని శ్రీమదేకామ్రనాథులవారికిని శ్రీకామాక్షీదేవికిని మిగుల రమణీయంబులగు నాలయంబులను గట్టించి యాదేవియొక్క యుగ్రతేజంబు నాకర్షించి యాదేవాలయమున శ్రీచక్రంబు లిఖయించి యదివఱకు నాదేవికిఁ జరుగుచుండిన తాంత్రిక పూజను నిలిపి వైదిక పూజనేర్పఱచిరి.

ఇట్లుఁగున శ్రీశంకర దేశిక సార్వభౌములీ భరతఖండము యొక్క నలువైపులకుంజని దిగ్విజయంబునొంది ఖ్యాతివహించి సర్వబ్రాహ్మణ విద్వజ్జనంబులు వీక్షించుచుండ శ్రీరాజరాజేశ్వరీ సన్నిధానంబగు కాంచీనగరమున సర్వజ్ఞపీఠము నారోహించిరి. దీనికే కామకోటిపీఠమను వ్యవహారనామము గలదు.

ఆసమయంబున దత్తాత్రేయ మునివరుండు శ్రీమదాచార్యులవారి యసాదృశ్య సామర్థ్యమును నద్భుత చరిత్రములను నెఱింగి యచ్చటికి విజయముచేసి యాచార్యులవారిని జూచి "మహాత్మా! పాషండమతముల ఖండనజేసియు, నద్వైతమతమును స్థాపించియు, సరస్వత్యంశంబని లోకప్రసిద్ధిఁగాంచిన భారతినిజయించియు, యశశ్చంద్రికల జగంబున వ్యాపింపఁజేసిన విద్యానిధివగు నీవు శ్రీజగద్గురువను ప్రసిద్ధినిబొందియుందువుగాక" యని యాశీర్వదించిరి. అట్టి మహోత్సవతరుణమున నేతెంచిన చోళదేశాధీశుండగు రాజసేన మహారాజును సకల విద్వజ్జనంబులును నానందభరితులైరి. అమానుష

చరిత్రులగు నాచార్యులకు నారాజు శ్వేతచ్ఛత్ర స్వర్ణచామర నవరత్నఖచితాందోళికాది బిరుదములను స్వర్ణపాదుకలను నొసంగి సన్మానించెను.

శ్రీమదాచార్యులవారి శిష్యకోటిలోఁజేరిన కొందఱు ఛత్ర, చామర, మకరతోరణ, మయూరపుచ్ఛ, స్వర్ణవేత్రాదులంబట్టుకొని జయజయధ్వానంబులు సలుపుచుండిరి. మఱికొందఱు వీణావేణు మృదంగాది వాద్యఘోషంబులుగావించిరి.

ఇట్లు మిగుల విఖ్యాతినొంది సకలవైభవోపేతులై యుండిన శ్రీశంకరులను వీక్షించి దత్తాత్రేయ మునివరుండు నిజాశ్రమంబునకుం జనియె.

అనంతరము శ్రీమదాచార్యులవారు కాంచీనగరమున నొక మఠంబు నిర్మించి యందు కామకోటిపీఠమును రచియించి యోగలింగ చంద్రమౌళీశ్వరులను బ్రతిష్ఠించిరి. ఆసమయంబున తామ్రపర్ణీతీరమునుండి యాచార్యుల సన్నిధానమున కేతెంచిన యొక బాల బ్రహ్మచారియొక్క విద్యాతిశయమునకు మెచ్చి యతనికి సన్యాసం బిచ్చి "సర్వజ్ఞాత్మ చరణేంద్ర సరస్వతి" యని నామధేయం బొనర్చి యాప్రజ్ఞావంతు నాపీఠమున నియమించి సురేశ్వరాచార్యుల నాతనికి సంరక్షణకర్తగా నేర్పఱచిరి. ఈకారణమువలన కామకోటిపీఠ గురుపరంపరలో సురేశ్వరాచార్యులు శ్రీమదాచార్యులవారికి వెనుకటివారని గణింపఁబడిరి.

మఱియు సర్వజ్ఞాత్మ చరణులవారికి యుక్తవయస్సువచ్చిన పిదపఁగూడ సురేశ్వరాచార్యులవారు కాంచీ కామకోటిపీఠము నధిష్ఠించి వారిజీవితకాల పర్యంతము కాంచీనగరముననే వాసముచేయుచుండి యచ్చటనే సిద్ధిఁజెందిరి.

ఈ మఠము క్రీస్తుకు వెనుక పదునెనిమిదవ శతాబ్దమున తంజావూరును పాలించుచుండిన ప్రతాపసింహుని కాలమున నతని ప్రార్థన ననుసరించి తంజావూరిలోఁ బ్రతిష్ఠింపఁబడి యావల శరభేంద్ర మహారాజు దినములలోఁ గావేరీజల సన్నివేశమును బట్టి కుంభకోణమునఁ బ్రతిష్ఠింపఁబడి ప్రకృత మచ్చట నున్నది.

ఇట్లు శ్రీశంకరభగవత్పాదులవారు కర్మక్షేత్రమనంబడు నీ భరతఖండమున నవతరించి యిందు ప్రబలియుండిన దుర్మతములను ఖండించి జనన మరణ ప్రవాహరూప సంసార తరణ యోగ్యంబగు నద్వైతవిద్యను బోధించి శిష్యకోటిని తరింపఁజేసి కాంచీనగరంబునఁ గామాక్షీదేవియొక్క యాలయంబుఁజేరి యందొక విజనప్రదేశంబున బ్రహ్మనిష్ఠంబూని కలియుగమున 2625 వ సంవత్సరమునకు సరియైన రక్తాక్షినామవత్సర (క్రీ. ముం. 477) వైశాఖశుద్ధ యేకాదశి దినంబున నఖండతేజస్స్వరూపులైరి.

శ్రీశంకరులవారు కాంచీనగరమున సిద్ధిఁజెందిరనుటకు శ్రీకామాక్షీదేవ్యాలయములోనుండు వారి శిలావిగ్రహమే ప్రత్యక్ష నిదర్శనమై యున్నది.

జయతుజయతులోకే శశ్వదద్వైతవిద్యా
జయతువిమతపక్ష ధ్వాంతమార్తండమూర్తిః
జయతు యతివరేణ్యో బ్రహ్మజీవైక్యవాదీ
జయతుగురువతంసశ్శంకరాచార్యవర్యః ॥

మంగళం దేశికేంద్రాయ
మహనీయగుణాత్మనే
ఈశ్వరస్యావతారాయ
శంకరార్యాయ మంగళమ్ ॥

ఇయ్యది

నర్మదానదీతీరమున శ్రేష్ఠులయూరని వాసికెక్కిన గ్రామమున నివ
సించియుండిన తచ్ఛ్రేష్ఠుల వంశ సంజాతుండును శ్రీమత్కౌశిక
గోత్రోద్భవుండును, వేదపారంగతులును జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులునగు
శ్రీవేంకటేశ్వర జటావల్లభులవారి పౌత్రుండును శ్రీవీరరాఘవ జటావల్ల
భులవారి యౌరస పుత్త్రుండును, అణ్ణాజీ శాస్త్రులవారను వ్యావ
హారిక నామధేయముతో న్యాయ వాదులుగ వ్యవహరించు
చుండిన శ్రీయజ్ఞేశ్వర శాస్త్రులవారి స్వీకారతనయుండును,
వేంకటగిరి సంస్థానములో నాస్థానపండితులుగనుండిన
వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రులవారి యనుజుండును,
ఉద్యోగమునుండి విరమించిన న్యాయవాదియు
శ్రీసాంబసదాశివ చరణారవింద సేవాసక్తుం
డును సకల సజ్జన విధేయుండు నగు
శ్రీకృష్ణ నామధేయ ప్రణీతంబగు
జగద్గురు శ్రీశంకరభగవత్పాదా
చార్య చరిత్రము
సంపూర్ణము.
"ఓం తత్సత్"

---

శ్రీరస్తు

# అనుబంధము ౧.

# శ్రీ శంకరభగవత్పాదాచార్యావతార ప్రకరణము.

---

(శ్రీ చిత్సుఖాచార్య విరచిత బృహచ్ఛంకరవిజయములోనిది.)

శ్లో॥ కాలట్యాఖ్యే గ్రామవర్యే కేరళాలంకృతీకృతే।
విద్యాధిరాజతనయః ప్రాజ్ఞః శివగురుర్బభౌ ॥ 1

తదా సదాశివః శంభు శ్లోకానుగ్రహతత్పరః।
ఆర్యాంబాకమితుస్తస్య భక్తి వైరాగ్యశాలినః॥ 2

సుతార్థం తప్యమానస్య పత్న్యాస్సార్థం మహర్నిశం।
మనోరథం పూరయితుమియేష కరుణానిధిః॥ 3

తతో మహిమ్నా తత్పత్న్యాం ప్రవివేశ స్వతేజసా॥
సాదధార సతీ గర్భమాదిత్యసమతేజసం॥ 4

నిధానగర్భాధాత్రీవ శమీవాంతర్హితానలా।
వ్యజాయత తదార్యాంబా శివైకాయత్తచేతనా॥ 5

దృష్ట్వా శివగురుర్యజ్వా భార్యామార్యాంచ గర్భిణీం।
వృషాచలేశం సతతం స్మరన్నేకాగ్రచేతసా॥ 6

దయాళుతాం స్తువన్ శంభోర్దినేష్వపి మహాత్స్వపి
వవృధే సపయోరాశిః పూర్ణేందోరివ దర్శనాత్॥ 7

వ్యజాయత శుభః కాలః పంచోచ్చగ్రహసంయుతః।

కల్హారకలికాగంధ బంధురో మరుదావవౌ ॥ 8
దిశఃప్రకాశితాకాశా బభూవుస్సూర్యరశ్మిభిః ।
ప్రాయఃప్రదక్షిణజ్వాలా జజ్వలుర్యజ్ఞ పావకాః ॥ 9
ననందుర్బాంధవాస్సర్వే ననృతుశ్చాప్సరోగణాః ।
ససృజుఃపుష్పవర్షాణి దేవాభువ్యంతరిక్షగాః ॥ 10
ఆసీత్తదాదివ్యగానం స్వర్గలోకేచిరంసుఖం ।
ప్రసన్నమభవచ్చిత్తం సతాంప్రతపతామపి ॥ 11
తతఃసాదశమేమాసే సంపూర్ణశుభలక్షణే ।
షడ్వింశే శతకే శ్రీమద్యుధిష్ఠిరశకస్యవై ॥ 12
ఏకత్రింశేథవర్షేతు హాయనే నందనేశుభే ।
మేషరాశిం గతేసూర్యే వైశాఖేమాసిశోభనే ॥ 13
శుక్లేపక్షేచ పంచమ్యాం తిథ్యాంభాస్కరవాసరే ।
పునర్వసుగతేచంద్రే లగ్నేకర్కటకాహ్వయే ॥ 14
మధ్యాహ్నే చాభిజిన్నామ ముహూర్తే శుభవీక్షితే ।
స్వోచ్చస్థేకేంద్రసంస్థేచ గురౌమందే కుజేరవౌ ॥ 15
నిజతుంగగతేశుక్రే, రవిణాసంగతేబుధే
ప్రాసూతతనయంసాధ్వీ గిరిజేవషడాననం ॥ 16
ఉదయాచలవేళేవ భానుమంతం మహౌజసం ।
దుర్నిరీక్ష్యైః స్వతేజోభి ర్భాసయంతం దిశోదశ ॥ 17
బాల్యత్వేపి విశాలాక్షం మతివిస్తృతవక్షసం ।
ఆజానులంబితభుజం సువిశాలనిటాలకం ॥ 18
ఆరక్తోపాంతనయన వినిందిత సరోరుహం ।
ముఖకాంతిపరాభూత రాకాహిమకరాకృతిం ॥ 19
శంఖచక్రధ్వజాకార రేఖాచిహ్న పదాంబుజం ।

ద్వాత్రింశల్లక్షణోపేతం విద్యుద్దాభకళేబరం ॥ 20
ప్రమోదం దృష్టమాతేణ విశంతం తం స్తనంధయం ।
పాయంపాయం దృశాప్రేమ్ణా శ్రీకృష్ణమివ దేవకీ ॥ 21
ప్రపేదే న క్షణం తృప్తిం చకోరీవ సుధాకరం ।
తాదృశం బాలకం దృష్ట్వా సా బభూవాతి విస్మితా ॥ 22
సచాద్భుతః కిశోరోపి కించిద్వ్వచలితాధరః ।
తాడయన్ చరణౌ హస్తౌ రురోద మధురస్వనం ॥ 23
తత్రత్యా వృద్ధనార్యోపి యథోచిత మథాచరన్ ।
బాలకం మేనిరే వీక్ష్య దిందుబింబ మివోజ్జ్వలం ॥ 24
తతః శ్రుత్వా పితా సోపి నిధిం ప్రాప్యేవ నిర్ధనః ।
ముముదే నితరాం చిత్తే విత్తేశం నాభ్యలక్ష్యత ॥ 25
స్నాత్వా శివగురుస్తూర్ణం యజ్వనామగ్రణీ స్తతః ।
విప్రానాకారయామాస పురంధ్రీరపి సర్వతః ॥ 26
తదోత్సవో మహానాసీత్ పురే సద్మని సంతతం ।
ధాన్యరాశీన్ మఖిభ్యోసౌ విద్వద్భ్యో భూయః ప్రదత్తవాన్ ॥ 27
ధనాని భూరి విప్రేభ్యో వేదవిద్భ్యో దదేశసః ।
వాసాంసి భూయో దివ్యాని సఫలాని ప్రదత్తవాన్ ॥ 28
పురంధ్రీణాం చ సైరంధ్రం వస్తుజాతమదాదసౌ ।
ఘటోధ్నీర్బహులాశ్ఛో గాశ్చ సాలంకారాః సదక్షిణాః ॥ 29
తతః శివగురుర్యజ్వా బ్రాహ్మణాన్ పూర్వతోధికం ।
సంతర్ప్య బంధుభిస్సార్థం ముదితోన్యవసత్ సుధీః ॥ 30

సర్వజ్ఞానః ॥ శ్రీచిత్సుఖేంద్ర ! గురురాజ సముద్భవోద్యద్వృత్తం నిశమ్య నితరాం హృషితం మనోమే । అగ్రే యదద్య వద తచ్చరితం క్రమేణ భూయో నతోస్మి గురవే భవతాపహర్త్రే ॥

౮ శ్రీచిత్సుఖః॥ సర్వజ్ఞాత్మ సుధీమణే! సకృదిమం గ్రంథం వా శ్రుణో త్యాదరాత్ శ్రీమచ్ఛంకర దేశికేంద్ర చరణావిర్భావమత్యద్భుతం॥ సోఽప్యద్ధాథ వితాభిధావిగళితస్త్వైక్యంచ జీవేశయోః జీవన్ముక్త ఇవా చరన్నతితరాం నిశ్శ్రేయసాయేహతే॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకరభగవ త్పూజ్యపాదపాథోజ మరందనిష్యందాస్వాద తుందిలానంద మిళిందాయమానమానస శ్రీచిత్సుఖయతీంద్రసర్వజ్ఞాత్మ తపోధనేంద్ర సంవాదే శ్రీ బృహచ్ఛంకరవిజయే శంకరాచార్య సత్పథే శ్రీశంకర ప్రాదుర్భావాఖ్యం ద్వాత్రింశ ప్రకరణమ్

సమాప్తమ్.





శ్రీరస్తు.

# అనుబంధము ౨.

## శ్రీశంకరభగవత్పాదాచార్యావతార కాలనిర్ణయము:—

శ్రీశంకర భగవత్పాదులే వారవతరించినకాలమును గూర్చి వారిచరిత్రమును వ్రాసినపలువురు పలువిధములుగ వివరించియుండుటవలన వారువర్ధిల్లినకాలమును నిర్ణయించిచెప్పుటకు నేఁటివఱకెవ్వరికిని సాధ్యపడకయున్నది. ఆత్మవిచారముచేసి ప్రపంచమందంతటఁ బ్రఖ్యాతివహించిన మహానీయులలో శ్రీమదాచార్యస్వాములవారి దివ్యనామధేయము, ప్రప్రథమమున గణింపఁదగినదిగానున్నది.

ఇట్టి యమానుషప్రజ్ఞగల వారీభరతఖండమున వర్ధిల్లినకాలము నిష్కర్షగాఁ దెలియకుండుట మిగులఁ గొఱంతగదా? కావున వారవతరించిన కాలమునుగుఱించి, వారినిగూర్చి వ్రాయఁబడిన చరిత్రముల నొకటొకటిగఁ బరిశీలించిచూతము.

1. శ్రీ శంకరభగవత్పాదులవారి చరిత్రమును వ్రాసిన గ్రంథకర్తలలో * మాధవాచార్యకృత శంకరవిజయమను పేరితో మాధవకవి వ్రాసిన గ్రంథములో శ్రీమదాచార్యులవారి జననకాల మీతీరున వివరింపఁబడియున్నది.

శ్లో॥ లగ్నేశుభేశుభయుతే సుషువేకుమారమ్,
శ్రీపార్వతీవసుఖినీ శుభవీక్షితేచ।
జాయాసతీశివగురో ర్నిజతుంగసంస్థే
సూర్యేకుజేరవిసుతేచ గురౌచకేంద్రే॥

---

* ఈగ్రంథకర్తయే పూర్వాశ్రమమున విజయనగర సంస్థానాధిపతులగు బుక్కదేవరాయలయొద్ద మంత్రిగనుండి యాశ్రమ స్వీకారానంతరము విద్యారణ్యులనుపేర శృంగగిరిపీఠము నలంకరించెనని కొందఱు భ్రమపడియున్నారు.

తా॥ శుభలగ్నమున శుభగ్రహ వీక్షణంబుగలిగి రవ్యంగారక శనైశ్చరగ్రహము లుచ్చస్థితిని, గురువు కేంద్రమును బొందియుండఁగా, శ్రీపార్వతీదేవి కుమారస్వామిని బ్రసవించినట్లు శివగురు దీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ పురుషశిశువుం గనెను. (2-వ అధ్యాయము 71 శ్లో.)

ఇట్టి గ్రహసంపత్తి ప్రభవమొదలగు నఱువది సంవత్సరములు గల శకములో నేశకములోనైనను తటస్థింపవచ్చును. పై శ్లోకములోఁ గాలనిర్ణయముఁ జేసియుండనందున, నట్టికాలముం గనిపెట్టుట దుస్తరముగనున్నది. అయినను, కేరళదేశమునకుం జేరిన కొచ్చి సంస్థానములోనుండు జ్యోతిష శిరోమణియగు పిచ్చయ్యగారు పై గ్రహసంపత్తి క్రీ. వె. 805 లో తటస్థించినదనియు నాకాలముననే శ్రీమదాచార్యులవా రవతరించియుండవలయుననియు నిర్ణయించిరి. ఈవిషయమునే దివాన్ బహదర్ స్వామికణ్ణుపిళ్లగారు దృఢపఱచిరి.

మఱియు నిటీవల బెజవాడలో ముద్రింపఁబడిన "అనుభూతజాతకతరంగిణి" అను గ్రంథములో శ్రీమదాచార్యులవారి జాతకముతోడఁ గనఁబఱచియుండువారి జననకాలము, పై యిరువురి యభిప్రాయముల ననుసరించి యున్నది. అది యేలాగనిన:— కలిలో 3907 సంవత్సరములకు సరియైన శాలివాహన శకాబ్దంబులు 728 కి క్రీస్తుశకమున 805 వ సంవత్సరమునకు సరియగు నీశ్వరనామ సంవత్సర వైశాఖశుద్ధ పంచమీయుక్తయిందువాసరంబునఁ గర్కాటక లగ్నాఖ్యాభిజిన్ముహూర్తమున, ఆర్ద్రాప్రథమచరణ కర్కటక తృతీయద్రేక్కాణంబున, శుభషడ్వర్గలయందు శ్రీమ

| | ర | బు శు | చం |
|---|---|---|---|
| | రాశి | | ల గు |
| కు | | | |
| | | శ | |

ద్వైతమతోద్ధారక శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్య స్వామివా రవతరించిరని యున్నది.

ఈ కాలనిర్ణయ మాదిశంకరులకుఁ బిదపఁ గాఁచికోటిపీఠము నలంకరించిన యాచార్యస్వాములలో ముప్పదియాఱవవారగు నభినవ శంకరాచార్యులవారి జననకాలము (క్రీ. వె. 788-వ సంవత్సరము)ను గూడ నతిక్రమించియుండుటవలన నానిర్ణయము యుక్తి యుక్తముగఁ దోఁపదు.

కాఁబట్టి తత్పూర్వము గడచిన ప్రభవాది శకములో నేశకములోనైన నట్టి గ్రహసన్నివేశము తటస్థించి యాకాలములోనే శ్రీశంకరభగవత్పాదులవా రవతరించి యుండవలయును. ఏలయన, పైఁగనిన మాధవకవి వ్యాసాచలీయ శంకరవిజయములలో వివరించి యుండు శ్రీశంకరులవారి జననకాలమునుగూర్చిన శ్లోకములలోఁ గాలనిర్ణయములేని రెండవశ్లోకమును మాత్రము వివరించి కాలనిర్ణయముతోఁ గూడిన పూర్వశ్లోకమును వదలియున్నాఁడు. ఆయంశ ముత్తరగ్రంథమున నిరూపింపఁబడును.

మఱియుఁ బై "జాతకతరంగిణి" యను గ్రంథములో వివరించియుండుమేరకు, క్రీ. వె. 805 కు, ఈశ్వరసంవత్సరము తటస్థింపక పార్థివవత్సర మగుచున్నది.

ఇదియుఁగాక, మాధవీయ శంకరవిజయ గ్రంథశైలినింబట్టి విద్యారణ్యస్వాములవారు పయిగ్రంథమును రచియించినదిగ నుండ లేదనియు, మాధవనామధేయుండగు మఱియొక కవివర్యునిచే రచింపఁబడి యుండవలయుననియుఁ గొందఱు తలఁచుచున్నారు. మఱి గొందఱు ఆస్వాములవారి హస్తలిఖితమేయని యభిప్రాయ పడుచున్నారు.

ఎవరెట్లభిప్రాయపడినను నందులోఁ గ్రీస్తుకుఁబిదప నేడవశతాబ్దాదిలో, మగధరాజ్యమునేలిన శ్రీహర్షవర్ధమానుఁడను ప్రభుస్థానములో నాస్థాన పండితులుగనుండిన బాణమయూరులనెడు సుప్రసిద్ధ

కవిచంద్రులకును, క్రీ. వె. 8-వ శతాబ్దములో వర్ధిల్లిన దండికవీంద్రు నికిని, శ్రీశంకరభగవత్పాదులవా రద్వైతవిద్యను బోధించినట్లును, మఱియు క్రీ. వె. 12-వ శతాబ్దములో వేదాంత సూత్రములకు భాష్యమును రచించిన నీలకంఠాచార్యులను, క్రీ. వె. 10-వ శతాబ్దములో నాపస్తంభ గౌతమ ధర్మసూత్రములకు వ్యాఖ్యానముగావించిన హరదత్తాచార్యులను, ఆకాలమునందే బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానముఁ జేసిన భట్టభాస్కరాచార్యులను, శ్రీమదాచార్య స్వాములవారు వాదమున నోడించినదిగను, నివి మొదలగు నసంభవములు పెక్కులు గనఁబడుటవలనఁ బై గ్రంథము విద్యారణ్య స్వాములవలన రచియింపఁబడినదిగాఁ దలఁచుటకు వీలులేకుండుట యేగాక, కథాసరణికి నుపయుక్తముగఁగూడ నుండలేదు.

2. శ్రీమదాచార్యులవారి చరిత్రమును వ్రాసిన చిద్విలాస యతీంద్రులవారు "శంకరవిజయ విలాసము"ను గ్రంథములో వారి జననకాలము నిట్లు వివరించియున్నారు.

శ్లో॥ తతస్సాదశమేమాసి సంపూర్ణశుభలక్షణే।
దివసేమాధవర్తౌచ, స్వోచ్ఛస్థే గ్రహపంచకే॥

శ్లో॥ మధ్యాహ్నేచాఽభిజిన్నామ, ముహూర్తేఽదితిసంయుతే।
ఉదయాచలవేళేవ, భానుమంతంమహౌజసమ్।

శ్లో॥ ప్రాసూతతనయంసాధ్వీ, గిరిజేవషడాననమ్।
జయంతమివపౌలోమీ, వ్యాసంసత్యవతీయథా॥

(5-వ అధ్యాయము, 37, 38, 39 శ్లో.)

తా॥ వసంతఋతువునందు పునర్వసు నక్షత్రముతోఁగూడిన యొకశుభదినమున నభిజిన్ముహూర్తమున నైదుగ్రహములు లుచ్ఛస్థితిని బొందియుండఁగా, పార్వతీదేవి కుమారస్వామిని, పౌలోమిజయంతుని, సత్యవతి వేదవ్యాసులను బ్రసవించినట్లు శివగురుదీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ, ఉదయపర్వత శిఖరమున నుదయించు సూర్యునికాంతివంటి కాంతితోఁగూడిన యొక పుత్రునిఁగనెను.

మాధవకవి, తాను రచించిన శంకరవిజయములో శ్రీమదాచార్యులవారి జననకాలమున నున్న గ్రహసన్నివేశమును వ్యక్తముగఁ దెలిపెను. ఈగ్రంథకర్తగారు ఋతువును, నక్షత్రమును, లగ్నమును జెప్పి యైదుగ్రహము లుచ్చస్థితియందుండినవనిమాత్రము వివరించిరేకాని యాగ్రహము లేవి యను విషయము నగపఱచి యుండలేదు.

బహుశః వీరు శ్రీ చిత్సుఖాచార్య కృత బృహచ్ఛంకరవిజయములోని కొన్నియంశములను స్వీకరించియు, నేకారణముచేతనో కొన్నిటిని వదలియు, గ్రంథమును రచియించియున్నారని యూహింపఁదగియున్నది.

పైఁగనిన వర్తమానమువలన శ్రీశంకరులవారి జననకాలమును నిర్ణయించుట కెంతమాత్రమును వీలులేదు.

3. మఱియు, సదానందస్వాములవారు వ్రాసిన "శంకరదిగ్విజయము"ను గ్రంథములో శ్రీమదాచార్యులవారి జననకాలమిట్లగపడును.

శ్లో॥ సుముహూర్తే శుభేలగ్నే, సోచ్చస్థేగ్రహ పంచకే।
సాసతీ సుషువే బాలం శంకరాఖ్యం జగద్గురుమ్॥

**2-వ సర్గము 33-వ శ్లోకము.**

తా॥ ఒకానొక శుభముహూర్తమున నైదుగ్రహము లుచ్చస్థితిని బొందియుండఁగా నార్యాంబ, జగద్గురువులగు శంకరనామధేయముగలిగిన యొక బాలుని గనెను.

పూర్వగ్రంథములలోనున్న వర్తమానముగూడ నిందులో వివరించియుండనందున నిదియెంతమాత్రము నుపయోగకారికాదు.

వెండియు, నాగ్రంథ పరిశీలనమువలన పైఁగనిన మాధవీయాది మూఁడు గ్రంథములును క్రీ. శె. 1860 వ సంవత్సరమున, (Rev. William Taylor) విలియమ్ టెయిలర్ గారి వలనఁ బ్రకటింపఁబడిన యచ్చు కావలసిన సంస్కృత గ్రంథముల పట్టిక

లోఁజేరి యున్నట్లు తెలియలేదు. కనుకఁ బైనవివరించిన మూఁడు గ్రంథములును, మీఁదనుదాహరించిన కాలమునకుం బిదప రచింపఁబడినట్లు నిశ్చయింపవలసియున్నది.

4. ఇఁక, పైఁగనఁబఱచిన కాలమునకుఁ బిదప వ్రాయఁబడిన శ్రీమదాచార్యులవారి చరిత్ర గ్రంథములు విమర్శింపఁబడును.

అట్టి నవీన గ్రంథములపైకి "సకలార్థసాగరము"ను గ్రంథములో శంకరభగవత్పాదులవారు కలియుగములో 3058 వ సంవత్సరమునకు సరియగు నీశ్వర సంవత్సర వైశాఖశుద్ధ పంచమీ భానువార మార్ద్రానక్షత్రముతోఁ గూడిన శుభదినమందు, జన్మించినట్లు వివరింపఁబడియున్నది. ఈకాలము క్రీ. ము. 44 వ సంవత్సరముగ నేర్పడును.

ఇదియుఁగాక కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన "శంకరవిజయధ్వజము"ను గ్రంథములోను, శృంగగిరి పీఠాధిపతుల సన్నిధినున్న గురుపరంపర పట్టికలోనుండు పైకాలమునే వివరించియున్నారు.

మఱియు సూరతు పురవాసులగు యజ్ఞేశ్వరశాస్త్రిలవారు రచించిన "ఆర్యవిద్యాసుధాకరము"ను గ్రంథములో నిటుల వ్రాసియున్నారు.

శ్లో॥ నిధినాగేభవహ్న్యబ్దే విభవే మాసిమాధవే।
శుక్లేతిథౌ దశమ్యాంతు శంకరార్యోదయస్స్మృతః॥

తా॥ కలిగతాబ్దములు 3889 కి సరియగు విభవసంవత్సర వైశాఖశుద్ధ దశమిరోజున శంకరులవా రవతరించిరి. ఈకాలము క్రీ. వె. 788వ సంవత్సరమునకు సరిగనున్నది.

పైకాలమునే మఱికొన్ని గ్రంథములలో దిగువఁ గనఁబఱచియుండుదీతిగ వివరించియుండునట్లు "భారతి" యను పత్రిక యొక్క రెండవ సంపుటము 5 వ సంచిక 158-వ పుటలోఁజెప్పఁబడియున్నది.

శ్లో॥ ప్రాసూతతిష్యశరదాం మతియాతవత్యా।
మేకాదశాధికశతోన చతుస్సహస్ర్యాం।
సంవత్సరేవిభవనామ్ని శుభేముహూర్తే।
రాధేఽసితేశివగురోర్గృహిణీదశమ్యాం॥

తా॥ కలిలో 3889 కి సరియగు విభవ సంవత్సర వైశాఖ శుద్ధ దశమి రోజున నొక శుభముహూర్తమునందు శివగురు దీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ ప్రసవించెను.

(పై శ్లోకము, హాస్పేట భట్ట నీలకంఠశాస్త్రిలవారి "శంకరమందార సౌరభము"ను చంపూగ్రంథములో నగపడును.)

ఇదియునుంగాక, కోయంబుత్తూరులోనుండు దేశీయవిద్యాలయములో సహోపాధ్యాయులగు C. N. కృష్ణస్వామయ్యర్ M. A., L. T. గారు హూణభాషలో రచించిన శ్రీమదాచార్యులవారి చరిత్రములో, పైఁగనిన క్రీ. వె. 788 వ సంవత్సరమునే శంకరులవారి జననకాలముగా నుదాహరించియున్నారు.

ఇంకను, తిరుపతి పురవాసులును, ఉద్యోగమునుండి విరమించిన న్యాయవాదులు నగు నాగపూడి కుప్పుసామయ్యర్ B. A. గారు, ఆంధ్రభాషలో రచించిన "శ్రీశంకరాచార్య చరిత్రము"లో వారుకూడ కలియుగాబ్దంబులు 3889 కి సరియగు విభవసంవత్సర వైశాఖశుద్ధ పంచమి, ఆర్ద్రానక్షత్ర యుతంబగు శుభదినంబున నభిజిన్ముహూర్తమున సకలలోక శంకరుండగు శంకరుండవతరించెనని నుడివియున్నారు.

వీరు నిర్ణయించియుండు సంవత్సరమును మాసమునుమాత్రము పైనవివరించిన గ్రంథముల తాత్పర్యము ననుసరించియున్నది. వానిలో విభవ వైశాఖశుద్ధ దశమినాఁ డాచార్యులవారు జన్మించినట్లు కనఁబడుచుండఁగా, వీరదే కాలములో శుద్ధపంచమిరోజున నాచార్యులవారి జననమని వ్రాసియున్నారు. వైశాఖశుద్ధపంచమినాఁ డాచార్యులవారి జననమనుట నిర్వివాదమైన యంశము. అయితే

విభవసంవత్సర వైశాఖశుద్ధ పంచమి, ఆర్ద్రానక్షత్ర యుతంబగు రోజున వారు జన్మించినారనుట కాధారము కనిపించలేదు.

మఱియు, దిగువ నుదాహరింపఁబడు శంకరేంద్రవిలాసమనెడు గ్రంథమునందలి వాక్యములవలన విభవ వైశాఖశుద్ధ దశమి పుష్యమీనక్షత్ర యుక్తంబగు దివసంబున నాది శంకరులకుం బిదపఁ గామకోటిపీఠము నలంకరించిన యాచార్యస్వాముల పైకి ముప్పదియాఱవ వారగు నభినవ శంకరాచార్యులవారు జన్మించినటులు గనఁబడును.

శ్లో॥ "హాయనేఽథ విభవే వృషమాసే,
శుక్లపక్షదశమీ దినమధ్యే,
శేవధి ద్వ్యపదిశానలవర్షే,
తిష్యపేన ముదసోష్ట విశిష్టా ॥

తా॥ విశిష్టాదేవి కలివత్సరంబులు 3889 కి సరియగు విభవ సంవత్సరమున (క్రీ. వె. 788) వృషభమాసమునందు శుక్లపక్ష దశమిరోజున పుష్యమీ నక్షత్ర యుక్తంబగు శుభదినమున నభిజన్మ్మహార్తమం నితనిని *(అభినవశంకరులను) కనెను.

మఱియు, బొంబాయి హైకోర్టు జడ్జిగనుండిన కాశీనాథత్ర్యంబక తెలంగుగారు, శ్రీమదాచార్యులవారి భాష్యములోఁ బాటలీపుత్ర నగరమునుం గూర్చియుఁ బూర్ణవర్మయను బౌద్ధప్రభువునుం గూర్చియు వారు ప్రశంసించి యుండుటచేతను, పాటలీ పుత్రనగరము (క్రీ. వె.) 756 లో నదీప్రవాహములో మునిఁగి నశించి యుండుటం జేసియు, పూర్ణవర్మ, క్రీ. వె. 6 వ శతాబ్దాంతమున మగధదేశమును బాలించియుండుటవలనను, శ్రీశంకర భగవత్పాదులవారు క్రీ. వె. 6 వ శతాబ్దాంతముననే వర్ధిల్లి యుండవలయునేకాని, క్రీ. వె. 788 లో జన్మించిరనుమాట సమంజసముగ నుండలేదని "The Indian Antiquary" (హిందూదేశపు ప్రాచీన వృత్తాంతమను) గ్రంథమున

* అభినవ శంకరులవారి చరిత్ర ముత్తరగ్రంథములో వివరింపఁబడును.

13 వ సంపుటము 96 వ పుటయందుదాహరించిరి.

పండిత భండార్కరుగారు తెలంగుగారి యభిప్రాయముతో నేకీభవించిరి. మఱియు, పండిత భాష్యాచార్యులు రచించిన "The Age of Sri Sankaracharya" (శంకరాచార్యులవారు వర్ధిల్లినకాలము) అను గ్రంథములో వారు పలువిధములయిన చర్చలఁజేసి తుదకు శ్రీమదాచార్యస్వాములవారు క్రీ. వె. 5 వ శతాబ్దములో నవతరించియుండవలయునని యభిప్రాయపడిరి.

ఇంకను, విజయనగరము మహారాజుగారి కలాశాలయందలి పండితులగు N. వెంకట్రామయ్యర్ M. A. గారివలన రచించిన "జగద్గురు శ్రీశంకర గురుపరంపర" అను గ్రంథములో, అభినవ శంకరాచార్యులవారి జననకాలము క్రీ. వె. 788 యని నిర్ణయించుచు, కామకోటి పీఠముయొక్క గురుపరంపర పట్టిక, పుణ్యశ్లోక మంజరి, గురురత్నమాల ఇత్యాదిప్రాచీన సాధనముల నుపేక్షించి పాశ్చాత్యులుఁ వ్రాసిన హిందూదేశముయొక్క ప్రాచీనచరిత్రము నాధారముగ గ్రహించి, ఆదిశంకరులు క్రీ. వె. ప్రథమశతాబ్దముయొక్కయుత్తరార్ధమున నవతరించియుండవలయునని నిశ్చయించిరి.

మఱియు, మద్రాసు హైకోర్టు వకీలుగనుండిన T. S. నారాయణశాస్త్రిలు, B. A., B. L., గారు రచించిన "The Age of Sankara" (శంకరులు వర్ధిల్లినకాలము) అను గ్రంథములో, అభినవ శంకరులవారి జననకాలము క్రీ. వె. 788 యని స్థిరపఱచుచు పాశ్చాత్యులు వ్రాసిన హిందూదేశపుఁ బ్రాచీన చరిత్రములో ననేక పొరపాటులఁజూపి శ్రీ చిత్సుఖాచార్యులవారు రచియించిన బృహచ్ఛంకరవిజయము మొదలగు పెక్కు ప్రాచీనగ్రంథముల నాధారమువలన శ్రీశంకరభగవత్పాదులవారు కలియుగాబ్దంబులు 2593 కి సరియగు నందన (క్రీ. ము. 509) లో వైశాఖశుద్ధ పంచమి పునర్వసు నక్షత్రముతోఁగూడిన శుభదినమందు కర్కాటకలగ్నమున నవతరించినట్లు నిర్ణయించియున్నారు.

మఱియు, కుంభకోణమునందలి కలాశాలలో నుపన్యాసకు లగు N. K. వేంకటేశ్వరయ్యర్, M. A. గారు రచియించిన "శ్రీ శంకరాచార్యులవారు & వారి కామకోటిపీఠము" అను గ్రంథమునం దును పైఁగనిన కాలమనఁగా (క్రీ. ముం.) 509 యే శ్రీశంకరుల వారవతరించిన కాలమని దృఢపఱచియున్నారు.

ఇంకను, మద్రాస్ హైకోర్టు వకీలుగనుండి ప్రకృతము చోళ దేశములో సబ్‌జడ్జిగానుండు K. S. రామస్వామి శాస్త్రిలు B. A., B. L. గారు రచియించిన శ్రీ శంకరాచార్యులవారి చరిత్ర ములో, శ్రీమదాచార్యులవారు వృషదేవవర్మయొక్క ప్రభుత్వకా లములో నేపాళరాజ్యమునకు విజయముచేసినట్లు "నేపాళదేశ శాస నమ"నంబడు నొక లిఖితమువలనఁ దెలియవచ్చునట్లును, ఆరాజు క్రీస్తు పుట్టుటకు 500 సంవత్సరములకుఁ బూర్వమా రాజ్యపరిపాల నము సేయుచుండెననియు, నిత్యాదిహేతువులంగని, క్రీ. ముం. 509 లోనే యాదిశంకరులవా రవతరించియుండవలయునని తీర్మానించిరి.

ఇదియుఁగాక, శ్రీమండనమిశ్రుల పరంపరలోఁజేరిన శేష య్యగారి పుత్రులగు సుబ్రహ్మణ్యయ్యగారివలన హిందూస్థాని భాషనుండి యఱవభాషకు తర్జుమాచేయఁబడిన "జగద్గురు శ్రీశంకర భగవత్పాదులవారి చరిత్రము" నందును పైకాలమే కనఁబడును.

5. ఇఁక, ఈవిషయమై పాశ్చాత్య పండితులయొక్క యభి ప్రాయ మెట్టిదనిన:—

బెల్గాందేశస్థుండగు "గోవిందభట్ట యేశ్లేకరు" అను వానివద్ద సంస్కృతభాషలో దేవనాగరీ లిపియందు వ్రాయఁబడిన యొక లిఖి తములో శ్రీమదాచార్యులవారు కలియుగమున 3889 వ సంవత్స రమునకు సరియయిన విభవసంవత్సరము (క్రీ. వె. 788) లో వైశా ఖశుద్ధ పౌర్ణమరోజున జన్మించి యా కలిలో 3921 వ సంవత్సరము (క్రీ. వె. 820) లో సిద్ధిఁజెందినారని నిర్ణయమైయుండెను. పై వృత్తాంతమును "Mr. K. B. Pathak" (కె. బి. పతక్) అను

నతఁడు "The Indian Antiquary" (హిందూదేశపు ప్రాచీన వృత్తాంతము) 11 వ సంపుటము 174, 175 పుటలలోఁ బ్రచురపఱచెను.

మాక్సుముల్లర్ అను పండితుఁడు (Professor Maxmuller) పై వృత్తాంతము నాధారముగఁ గైకొని శ్రీశంకరాచార్యులవారి జననకాలము, క్రీ. వె. 788 అని నిష్కర్షమైనట్లు "India-What it can teach us?" (ఇండియా-అది మనకేమిబోధించును?) అను గ్రంథములో 360 వ పుటలో నుదాహరించెను.

మఱియు "వీబర్ పండితుఁడు" (Professor Weber) కూడ "History of Indian Literature" (హిందూదేశపు వాఙ్మయ చరిత్రము) అను గ్రంథములో 51 వ పుట, వివరణము 38 లో శ్రీశంకరాచార్యులవారు క్రీ. వె. 8 వ శతాబ్దములో వర్ధిల్లినట్లు వివరించెను.

అయితే " Dr. Fleet " (డాక్టర్ ఫ్లీటు) అను విద్వాంసుఁడు " The Indian Antiquary " (హిందూదేశపు ప్రాచీనవృత్తాంతము) అను గ్రంథముయొక్క 14 వ సంపుటము 350 వ పుటలోను తారానాథుఁడు వ్రాసిన బౌద్ధమత గ్రంథము ననుసరించి Dr. Burnell (డాక్టర్ బర్నెల్) అను విద్వాంసుఁడు " Elements of South Indian Palaeography " (దక్షిణహిందూస్థానపు ప్రాచీన లిఖిత పరిశీలనములం గూర్చిన ప్రధానాంశములు) అను గ్రంథముయొక్క 37 వ పుటలోను, శ్రీమదాచార్యులవారు క్రీ. వె. 7 వ శతాబ్దములో జన్మించినారని తెలిపియున్నారు.

మఱియు, " Professor Wilson " (విల్సన్ పండితుఁడు) శంకరులు వర్ధిల్లినకాలముంగూర్చిన యభిప్రాయముల నన్నింటిని యుదాహరించి, తుదకు రామమోహన రాయలతో నేకీభవించి, శంకరభగవత్పాదులవారు క్రీస్తుకువెనుక 8 వ శతాబ్దాంతమందును 9 వ శతాబ్దాదియందున్నట్లు వ్రాసియున్నాఁడు. ('Vide Wilson's

Essays, Vol. I Page 194') ("విల్‌సన్ యొక్క యుపన్యాసముల"ను గ్రంథములో ప్రథమసంపుటము 194 వ పుటను చూడుఁడు.)

ఇదియుఁగాక, "Mrs. Annie Beasant" (అనిబెసంటు) అను నామెయు, "Revd. Lead Beter" (లెడ్ బీటర్ గారు) ను నిద్దఱు శంకరాచార్యులు కలరనియు నొకరు 2500 సంవత్సరముల క్రిందట నవతరించి మతసంబంధములగు నుపన్యాసములఁ గావించి రనియు రెండవవారు, క్రీ. వె. 7 వ శతాబ్దములో జన్మించి భాష్యాదులను వ్రాసిరనియు నభిప్రాయపడిరి.

6. ఇఁక, ప్రాచీన శంకరవిజయములలోఁ దీర్మానించియుండు వృత్తాంతములఁ బరిశీలింతము.

అట్టి గ్రంథములపైకి వల్లీసహాయకవి రచియించిన "ఆచార్య దిగ్విజయ కోలాహలమ"ను గ్రంథములోను, రాజచూడామణి దీక్షితులవారి "శంకరాభ్యుదయము" లోను శ్రీమదాచార్యుల వారవతరించిన కాలము వివరించియుండలేదు.

మఱియు, అనంతానందగిరికృత "ఆచార్యవిజయమ"ను గ్రంథములో నిట్లుదాహరింపఁబడియున్నది.

శ్లో॥ ప్రాప్తేతుదశమేమాసి విశిష్టాగర్భగోళతః ।
ప్రాదురాసీ న్మహాదేవః, శంకరాచార్యనామతః॥
శ్లో॥ ఆసీత్తదా పుష్పవృష్టిః దేవసంఘైఃప్రచోదితా।
నేదుర్దుందుభయోర్దివ్యాః స్వర్గలోకే చిరంసుఖం॥

2.వ అధ్యా.

తా॥ విశ్వజిత్తను బ్రాహ్మణోత్తముని ధర్మపత్నియగు విశిష్టా గర్భమునుండి భగవంతుఁడగు మహాదేవుండు శంకరాచార్య నామధేయముతో నుద్భవించెను. అప్పుడు దేవతలు పుష్పవర్షముం గురిపించిరి. దివ్యములగు దుందుభి వాద్యఘోషములు సెలంగెను.

ఇందులో నాచార్యులవారి జననకాలమునుగూర్చి కలియుగాదిగాఁగాని మఱియే యితర శకాదిగాఁగాని, వత్సర, మాస,

పక్ష, తిథి, వార, నక్షత్రములలో దేనినిఁగాని సూచించియుండలేదు.

మఱియు నీగ్రంథకర్త శ్రీమదాచార్యులవారి శిష్యుఁడని చెప్పుకొనుచు, క్రీ. శ. 788-వ సంవత్సరమునఁ జిదంబరమున జన్మించినవారును, కామకోటిపీఠము నలంకరించిన యాచార్యస్వాములపైకి ముప్పదియాఱవ వారునగు నభినవ శంకరాచార్యస్వాములవారి జననమును, ఆదిశంకరులవారి జననమని పొరపాటు పడి నట్లు పై శ్లోకతాత్పర్యమువలనఁ గనఁబడుచున్నది.

ఇదియుఁగాక, ఇందులో నసంగతములగు మఱికొన్నివిషయములును గలవు. అవేవన:— శ్రీమదాచార్య స్వాములవారి సన్నిధియందు లక్ష్మణాచార్యులనియు, హస్తామలకాచార్యులనియు నిద్దఱుశిష్యు లుండిరనియు, వారిలో మొదటివారు విశిష్టాద్వైతమును, రెండవవారు ద్వైతవిద్యను, బోధించినట్లు ప్రత్యక్షవిరుద్ధ విషయములు చెప్పఁబడియున్నవి. ఇంకను, చిదంబర క్షేత్రమున విశ్వజిత్తను పేరనొక విప్రశ్రేష్ఠుండుండెననియు, నతఁడు విరక్తుఁడై తపంబు సలుప వనంబునకేగిన పిదప నతని ధర్మపత్నియగు విశిష్టయను సాధ్వీమణి, ప్రతిదినంబును భక్త్యాచారములతో శ్రీమన్నటరాజస్వామిని సేవించుచు నద్దేవుని యనుగ్రహంబునం జేసి గర్భంబుధరియించి సకాలమున నొక పుత్రునిఁబడసినట్లును, అటుల జన్మించినశిశువే శంకరులని ప్రసిద్ధిఁగాంచెననియు నవ్యక్తప్రసంగమును గలదు. అయిన నందలి వాస్తవాంశము కాశ్మీరదేశాధిపతియొక్క రాజసభలో ముఖ్యపండితులుగ నుండిన వాక్పతి భట్టాచార్యులవారు రచియించిన "శంకరేంద్రవిలాసము"ను నభినవ శంకరాచార్యులవారి చరిత్రమువలన వ్యక్తమగుచున్నది. అభినవ శంకరాచార్యులవారి చరిత్రమును విజయనగరము మహారాజుగారి కలాశాలయందలి పండితులగు N. వెంకట్రామయ్యర్, M. A. గారు రచించిన "జగద్గురు శ్రీశంకరగురుపరంపర"లో నిట్లు వివరించియున్నారు.

"కాంచీ కామకోటిపీఠము నలంకరించిన యాచార్యస్వాము

లపైకి ముప్పదియాఱవవారగు నభినవ శంకరాచార్యస్వాములవారు చిదంబరక్షేత్ర నివాసులగు విశ్వజిత్తను విప్రోత్తముని తనయులు. విశ్వజిత్తు లోకాంతర్గతుఁడైన తరుణమున, వారి ధర్మపత్నియగు విశిష్టాదేవి గర్భవతిగనుండి, సహగమనముసేయఁ బ్రయత్నింపఁగా బంధువులందఱుఁ దత్ప్రయత్నమును నివారించిరి. అనంతర మా పతివ్రతా శిరోమణి గృహంబున కరిగి యుక్తకాలమువఱకు నిరీక్షించియుఁ బ్రసవము తటస్థింపమిం జేసియు, జనులందఱు జాడ్యలక్షణమని శంకించుటవలనను, నామానవతి మిగుల లజ్జనొంది శ్రీనటరాజస్వామివారి నాశ్రయించి యత్యంత భక్తిమై నారాధించుచు మూఁడు వత్సరములు గడచినపిమ్మటఁ గలియుగాబ్దంబులు 3889 కి సరియగు విభవ సంవత్సరము వైశాఖమాస శుక్లపక్షంబున పుష్యనీయుక్తదశమి రోజున (క్రీ. వె. 788) నొక పురుషశిశువుం గనెను. పదంపడి దైన్యతనొందిన యాదేవి, లోకాపవాదమునకు వెఱచి యాశిశువును సమీపారణ్యమునఁ బడవైచెను.

అంతనా యనాధబాలునిఁ దత్ప్రాంతారణ్యమున నివసించుచుండిన వ్యాఘ్రపాద మునీంద్రుని ధర్మపత్ని తెచ్చి మిగుల గారాబమునఁ బోషించెను. ఆ పసిబాలుని కైదవప్రాయమున నా మునీంద్రుఁ డుపనయనాదులంగావించి, వేదవేదాంగములను సకల శాస్త్రములను జెప్పించుటయు నాబాలుఁడు శీఘ్రకాలమున వేదశాస్త్రప్రవీణుఁడుగ నేర్పడెను.

అంతట నొకానొక సమయమున విద్యావంతుఁడగు నాబాలునకు శ్రీశంకర భగవత్పాదులవారు తమ ప్రియశిష్యులగు పద్మపాదులతోడ దర్శనమిచ్చి పద్మపాదులద్వారా తమపాదుకల నతనికి సన్మానంబు గావించిరి.

ఇట్లుండఁ గొంతకాలమునకుఁ గామకోటి పీఠాధిపతులగు మూడవవిద్యాఘనులను వారు యాత్రార్థము చిదంబరమునకు విజయముచేసిన తరుణమున నొకనాఁడు శ్రీనటరాజమూర్తి యశరీర

వాక్కునఁ నావిద్వన్మణిమహిమను వారికెఱింగించుటయు, తత్క్షణంబ వారాప్రాజ్ఞుని రప్పించి సన్యాసంబిచ్చి యభినవశంకరులని నామధేయంబొసంగి కామకోటి పీఠమున కధిపతులం గావించిరి.

పిదప, అభినవశంకరు లాదిశంకరులవలె భరతఖండమునందంతటను సంచరించి తమ విద్యాసామర్థ్యమువలన దిగ్విజయంబు గావించి, కాశ్మీరమునకు సహితము విజయముచేసి, యచ్చట రాజస్థానములో పండితాగ్రేసరుఁడుగనున్న వాక్పతి భట్టాచార్యులం గూడ వాదమున నోడించి, సర్వజ్ఞపీఠ మారోహించి, మిగులఁ బ్రఖ్యాతినిబొంది కామకోటి పీఠాధిపత్యము నేఁబదిరెండు సంవత్సరములు వహించి కలి 3941 కి సరియగు సిద్ధార్థిసంవత్సరమున ఆషాఢబహుళ అమావాస్యరోజున హిమాచలమునందలి యాత్రేయపర్వతమునకుఁ జేరిన దత్తాత్రేయ గుహాయందుఁ బ్రవేశించి బ్రహ్మైక్యముం బొందిరి.

మఱియు వారి విద్యాతిశయమును భగవద్భక్తియు విదేశీయులగు చీనాదేశవువారికిని తురుష్కులకును పారసీకులకుంగూడ వారియెడల భక్తినిగలిగించినవయ్యెను."

పై వృత్తాంతమువలన నభినవశంకరులు దీర్ఘకాలము మాతృగర్భముననుండి తండ్రి మరణానంతరము జన్మించినవారని స్పష్టమయ్యెను.

అట్టి యసాధారణ ప్రసవములు సకృత్తుగ నిప్పటికిని తటస్థించుచున్నవి. కావున నభినవ శంకరాచార్యులవారి జననముంగూర్చి యెట్టిదోషము చెప్పుటకును వీలులేకున్నది. అట్లుండియు ద్వైతమతస్థుండగు నారాయణపండితుఁడు ద్వేషబుద్ధితో భగవదవతారపురుషులగు శ్రీమదాచార్యులవారి జననముంగూర్చి "మణిమంజరి" అను గ్రంథములో నాచార్యులవారు "మణిమాన్" అను రాక్షసావతార పురుషులనియు మఱియు దుశ్శీలయగు నొకబ్రాహ్మణవితంతు గర్భమున జన్మించినవారనియు గర్ణకఠోరముగ వ్రాసియున్నాఁడు.

"కృష్ణ"-"కృష్ణ" అతఁడెంతపాపమునఁ గొడిఁగట్టె? అతనిసాహసమే సాహసము. అతఁడు శివరహస్యముం జదువకున్నను లింగకూర్మా త్యాది పురాణములముఖమే యెఱుంగఁడు కాఁబోలు! అట్టి యసాధువుల ప్రల్లదంబులను సడ్డచేయక శ్రీశంకరులవారి యవతారవిషయమై ప్రాచీనపురాణముల తాత్పర్యములం బరికించిచూతము.

శివరహస్యములో నిటులఁజెప్పఁబడియున్నది.

(౨) శ్లో॥ మదంశజాతం దేవేశి కలావపి తపోధనమ్।
కేరళేషు తదావిప్రం జనయామి మహేశ్వరి॥

శ్లో॥ తస్యైవచరితం తేఽద్య వక్ష్యామిశ్శృణుశైలజే।
కల్యాదిమే మహాదేవి సహస్రద్వితయాత్పరమ్॥

శ్లో॥ సారస్వతా స్తథాగౌడాః మిశ్రాఃకర్ణాజనాద్విజాః।
ఆమమీనాశనా దేవి ఆర్యావర్తాను వాసినః॥

శ్లో॥ కర్మైవ పరమంశ్రేయో నైవేశఃఫలదాయకః।
ఇతియుక్తి పరామృష్ట వాక్యైరు ద్బోధయంతిచ॥

శ్లో॥ తేఽఘోర కులాచారా కర్మసారా భవంతిచ।
తేషాముద్ఘాట నార్థాయ సృజామిూ శేమదంశతః॥

శ్లో॥ కేరళే శలలగ్రామే విప్రపత్న్యాం మదంశతః।
భవిష్యతి మహాదేవి శంకరాఖ్యోద్విజోత్తమః॥

(9-వ అంశము 16-వ అధ్యాయము.)

తా॥ ఓపార్వతీ! కలిప్రారంభమయిన రెండువేల సంవత్సరములకు పైఁబడి యార్యావర్తమునందలి సారస్వత, గౌడ, మిశ్ర, కర్ణాజినులను నాలుగు తెగలవారలగు బ్రాహ్మణులు కేవలము కర్మమే మిగుల శ్రేయమనియు నీశ్వరుఁడు ఫలప్రదుఁడు కాఁడనియు నీరీతిగఁ బ్రజలకింపైన వాక్యములను బోధించుచు, వైదిక ధర్మమార్గములనువదలి మత్స్యభుక్కులుగను, దురాచార ప్రవిష్టులునై యుందురు. అట్టివారిని సన్మార్గమునకుం ద్రిప్పుటకై కేరళదేశమున శలలయను గ్రామమున నుండునట్టి యొక బ్రాహ్మణోత్తముని ధర్మ

పత్నియొక్క గర్భమునందు నాయంశమున శంకరులను నామధేయముతోఁ దపోధనుండగు నొక్క విప్రశ్రేష్ఠుఁడు జన్మించును.

(b) శ్లో॥ నిందంతివేదవిద్యాంచ ద్విజాః కర్మాణివైకలౌ।
కలౌరుద్రోమహాదేవః శంకరోనీలలోహితః॥

శ్లో॥ ప్రకాశతే ప్రతిష్ఠార్థం ధర్మస్యవికృతాకృతిః।
యేతంవిప్రా నిషేవంతే యేనకేనాపిశంకరమ్।
కలిదోషాన్ వినిర్జిత్య ప్రయాంతి పరమంపదమ్॥

(లింగపురాణము 40-వ అధ్యాయము.)

తా॥ కలియుగమున బ్రాహ్మణులు వేదమును వేదప్రతిపాదిత కర్మములను నిందింతురు. మఱల యథాప్రకారము ధర్మమును స్థాపించుటకై భగవంతుండగు శంకరుఁడవతరించును.

అట్టి భగవంతుని విప్రులగువా రెవ్వరేవిధముచేతఁగాని సేవించుచున్నారో అట్టివారు కలికలుషములనుండి విడివడి మిగుల నుత్తమపదమును బొందుచున్నారు.

(c) శ్లో॥ కలౌరుద్రో మహాదేవో లోకానాం ఈశ్వరః పరః।
సదేవతాభవేన్నృణాం దేవతానాంచదైవతమ్॥

శ్లో॥ కరిష్యత్యవతారంస్వం శంకరోనీలలోహితః।
శ్రౌతస్మార్త ప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా॥

శ్లో॥ ఉపదేక్ష్యతి తత్ జ్ఞానం శిష్యాణాం బ్రహ్మసంజ్ఞితం।
సర్వవేదాంత సారంహి సర్వస్మాచ్చతు దర్శనాత్॥

శ్లో॥ యేతంవిప్రానిషేవంతే యేనకేనాప్యుపాయతః।
విజిత్యకలిజాన్ దోషాన్ యాంతితే పరమంపదమ్॥

(కూర్మపురాణము 27-వ అధ్యాయము.)

తా॥ కలియుగమున దేవదేవుండగు మహేశ్వరుండు తన భక్తుల హితముఁగోరినవాఁడై శ్రౌతస్మార్త ధర్మములను యథాప్రకారము స్థాపించుటకును సర్వవేదాంతసారమగు బ్రహ్మజ్ఞానమును సర్వశాస్త్రాభిప్రాయములను శిష్యులకుపదేశించుటకును నవతరింపఁబోవు

చున్నారు. ఎవరాభగవంతుని నేయుపాయము చేతనైనను సేవించుచున్నారో వారు కర్మములవలనఁ గలిగిన దోషములనుండి విముక్తులై యుత్తమగతినిఁ బొందుచున్నారు.

(d) శ్లో॥ కల్యాదౌద్వి సహస్రాంతే లోకానుగ్రహకామ్యయా।
చతుర్భిస్సహశిష్యైస్తు శంకరోఽవతరిష్యతి॥
(భవిష్యోత్తర పురాణము, 36-వ అధ్యాయము.)

తా॥ కలిప్రారంభమైన రెండువేల సంవత్సరములకుఁ బిదపఁ బ్రజల ననుగ్రహించు కొఱకు నలుగురు శిష్యులతోడ భగవంతుఁడగు శంకరుం డవతరించును.

(e) శ్లో॥ లోకానుగ్రహతత్పరః పరశివః సంప్రార్థితో బ్రహ్మణా।
చార్వాకాది మతప్రభేదనిపుణాం బుద్ధింసదాధారయన్।
కాలట్యాఖ్యపురోత్తమే శివగురుర్విద్యాధినాథశ్చయః।
తత్పత్న్యాంశివతారకేసముదితః శ్రీశంకరాఖ్యాంవహన్॥

శ్లో॥ కాంచ్యాం శ్రీకామకోటిం కలిమలశమనీం కల్పయిత్వా సురేశే।
శ్రీవిద్యారాజపీఠార్చన మహితమహారాజ్య సామ్రాజ్యలక్ష్మీమ్।
సంవేశ్యాత్మీయశిష్యే సకలభువనసమ్మోదహేతోర్మహాత్మా।
చిద్రూపస్వానుభూతిం భజతిభవమహాంభోధి సంతారణాయ॥

మార్కండేయ సంహిత 72 వ ఖండము, 7 వ పరిస్పందము.

తా॥ పరమశివుఁడు చతుర్ముఖ బ్రహ్మవలనఁ బ్రార్థింపఁబడినవాఁడై ప్రజల ననుగ్రహింపఁదలఁచి చార్వాకాది దుర్మతముల ఖండించుటయందసాధారణ ప్రజ్ఞతో వెలయుచు, కాలటియను నుత్తమ గ్రామమున విద్యాధినాథ తనయుండగు శివగురుదీక్షితుని ధర్మపత్నియొక్క గర్భమునందు శంకరనామధేయంబున నవతరించి కాంచీ

నగరమున కలికల్మషములం బోఁగొట్టునదియు, శ్రీ విద్యా రాజ
పీఠము నర్చించుటచే మహిమనొందిన మహారాజ్య సామ్రాజ్య
లక్ష్మీస్వరూపిణియగు కామకోటిని గల్పించి యందు సర్వజనానంద
ముకొఱకుఁ దమశిష్యులగు సురేశ్వరాచార్యుల నియమించి సంసార
సాగరమును తరింపఁజేయుటకై చిన్ముద్రతో జ్ఞానానందానుభవమును
జేయుచుందురు.

ఈవిషయమై యానందగిరి విరచిత ప్రాచీనశంకరవిజయము
లోను, వ్యాసాచలీయ శంకరవిజయములోను, శంకరభగవత్పాదుల
వారు కాంచీ కామకోటిపీఠమున సర్వజ్ఞమునియను నామధేయము
తో నాశ్రమ స్వీకారమును వహించి బాల్యదశయందున్నవారిని
దమకు వెనుకటి యాచార్యులనుగ నియమించి సురేశ్వరాచార్యుల
వారిని వారికి సంరక్షణకర్తగా నేర్పాటుచేసినటులఁ గనఁబడుచున్నది.
అయినను, సర్వజ్ఞమునులకు యుక్తవయస్సు వచ్చినపిదపఁగూడ సురే
శ్వరాచార్యులవారే వారి జీవితకాలమువఱకు కామకోటి పీఠాధిపత్య
మును వహించియున్నందున నిచ్చట సురేశ్వరాచార్యుల నొకరిని
మాత్రము నిర్దేశించి చెప్పఁబడినది.

పైనుదహరించిన పురాణములలోఁ గలిప్రారంభమైన రెండు
వేల సంవత్సరములకుఁ బిదప నతని ప్రాబల్యమువలనఁ బ్రజలెప్పుడు
వేదార్థములను నానావిధములుగాఁ బ్రతిపాదించుచు వైదిక ధర్మ
మార్గములను వదలి దుర్మత దురాచార ప్రవిష్టులయియుందురో
అప్పుడు భగవంతుఁడగు పరమశివుండు కేరళదేశమున కాలటియను
గ్రామమునందు విద్యాధినాథ నందనుండగు శివగురువను బ్రాహ్మ
ణోత్తమునికి తనయుఁడై యతని ధర్మపత్నియగు నార్యాంబగర్భ
మున శంకరనామధేయముతో నవతరించి వేదవిరుద్ధములగు చార్వా
కాది దుర్మతముల ఖండించి సర్వవేదాంత సారమగు బ్రహ్మజ్ఞానము
ను బోధించునని చెప్పఁబడియుండుటవలన, శ్రీశంకర భగవత్పాదు
లవారవతారపురుషులనుటకు సంశయమెంతమాత్రములేదు.

మఱియు, అనంతానందగిరి కృత యాచార్య విజయము, శ్రీమదాచార్యస్వాములవారి శిష్యులగు తోటకాచార్యులనెడు యానందగిరులవలనఁగాని, లేక శ్రీమదాచార్యులవారి భాష్యత్రయ వ్యాఖ్యాతలును, శ్రీకామకోటిపీఠమును "ఆనందజ్ఞానుల"ను నపరనామధేయముతో నలంకరించినవారు నగు మఱియొక యానందగిరుల వలనఁగాని వ్రాయఁబడినటులఁ దలఁచుటకువీలులేదు. ఆనందగిరి నామధేయముతో మఱియొకరు వ్రాసినటులఁ దోఁచుచున్నది.

7. ఇదియునుంగాక కేరళీయ శంకరవిజయములో శ్రీశంకరులవారి జననముంగూర్చి యిటుల వ్రాయఁబడియున్నది.

శ్లో॥ ప్రవృద్ధేతత్రచానూత నందనం నందనేశుభే।
వైశాఖేమాసిపంచమ్యాం శుక్లపక్షే పునర్వసౌ॥
శ్లో॥ ప్రాదుర్భావేకుమారస్య లగ్నమాసీత్సుశోభనమ్।
బలయుక్తశుభజ్యోతి స్సమారూఢస్సువీక్షితం॥
శ్లో॥ యేనసర్వజ్ఞతామేతి జాతవాన్ భువిమానుషః।
సచయోగోఽప్యభూత్తస్య ద్విజపుత్రస్యసంభవే॥

2 వ అధ్యాయము. 53, 54, 55 శ్లోకములు.

తా॥ శివగురుదీక్షితుని పత్నియగు నార్యాంబ ప్రసవకాలము లటస్థింపఁగా, నందనసంవత్సరములో వైశాఖమాసమున శుక్లపక్షమునందు పునర్వసుతోఁగూడిన పంచమిరోజున నుచ్ఛస్థితిఁబొంది బలయుక్తములగు శుభగ్రహములచేత వీక్షింపఁబడిన యొక శుభలగ్నమునందు సుపుత్రుంగనెను. మఱియు శంకరులవతరించిన లగ్నము, వారు సర్వజ్ఞులని ప్రసిద్ధివహింపఁదగిన యోగముతోఁ గూడియుండెను.

ఇందులో శంకరులవతరించిన సంవత్సరమేగాక మాస, పక్ష, దిన, నక్షత్రములుంగూడ వివరింపఁబడియున్నవి. అయితే పై సంవత్సర మేశకములోఁ జేరినదని తెలిసికొనుట కుపయుక్తమగు నంశము కనఁబడదు.

8. మఱియు వ్యాసాచలకవి రచియించిన "శంకరవిజయ కావ్యము"ను గ్రంథమున శ్రీమదాచార్యులవారి జననకాలమును గుఱించి యీక్రిందివివరములు గలవు:—

శ్లో॥ అబ్దేకలేరనలవర్ష శరాక్షిసంఖ్యే।
శ్రీనందనే దినమణావుదగధ్వభాజి।
రాధేధిపంచమి తిథౌ వసితేతరాయామ్।
వారేరవేరదితిభే శుభయోగయుక్తే॥

శ్లో॥ లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారమ్।
శ్రీపార్వతీవసుఖినీ శుభవీక్షితేచ।
జాయాసతీ శివగురోర్నిజతుంగసంస్థే।
సూర్యేకుజేరవిసుతే చగురౌచ కేంద్రే॥

4 వ అధ్యాయము. 20, 21 శ్లోకములు.

తా॥ కలిలో 2593 వ సంవత్సరమునకు సరియగు నందన సంవత్సరమునం దుత్తరాయణమున వైశాఖమాస శుక్లపక్ష పంచమీసహిత భానువారమునాఁడు పునర్వసు నక్షత్రమందు శుభగ్రహయుక్తమగు నొక్క శుభలగ్నమున సూర్యాంగారక శనైశ్చరగ్రహములుచ్చస్థితిని గురువు కేంద్రమును బొందియుండ శివగురుదీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ పార్వతీదేవి కుమారస్వామినింబోలె సుఖముగ నొక పుత్రుంగనియె.

ఇందు లగ్నమొకటితప్ప శ్రీమదాచార్యులవారి జననకాలమునుగూర్చి యుండవలసిన వివరములన్నియునున్నవి. ఈగ్రంథకర్తగారు వ్యాసాచల క్షేత్రవాసులగు సారంగపాణులనువారి తనయులు. వీరికి సర్వజ్ఞవిష్ణువనెడు నామధేయమునుగలదు. వీరు విద్యాతీర్థులను నపరనామధేయముతోఁ గాంచీ కామకోటిపీఠము నలంకరించినవారును విద్యారణ్యస్వాములవారి పరమగురువులునై యున్నారు. వీరి గ్రంథమునందు మిగుల వివరముగ వ్రాయఁబడిన పై రెండుశ్లోకములపైకి కాలనిర్ణయమునుం దెలుపని రెండవశ్లోకమును

మాత్రము మాధవకవి సంగ్రహించుకొని ప్రథమశ్లోకమును వదలి యున్నాఁడు.

మఱియుఁ బై గ్రంథములో శ్రీమదాచార్యులవారు సిద్ధిఁ జెందిన కాలమిట్లు కనఁబడును.

శ్లో॥ వర్షేకలేశ్వరవిలోచన శాస్త్రనేత్రే।
రక్తాక్షినామ్ని వృషశుక్ల ముకుందతిథ్యామ్।
గచ్ఛన్ సజాతుసవిధే పరదేవతాయాః।
త్యక్తుంసమైచ్ఛదథ భౌతికమాత్మదేహమ్॥

శ్లో॥ ప్రాగష్టమాద్విదితవేద్య ముదూఢబాల్యమ్।
సర్వజ్ఞసంజ్ఞమథహం సితమాత్మనైవ।
శ్రీకామకోటిబిరుదేన్య దథాత్ స్వపీఠే।
గు ప్తంస్వశిష్యతిలకేన సురేశ్వరేణ॥

శ్లో॥ ఇత్థంసశంకరగురుః కృతకృత్యభావాత్।
భావాన్ ప్రకాశ్య నిగమాంతగిరాంనిగూఢాన్।
కాంచ్యాంవిముచ్యవపురాదృతమిచ్ఛయైవ।
స్వస్యైవధామ్ని పరమే స్వయమేవలిల్యే॥

శ్లో॥ గామాక్రమ్యపదేఽధికాంచి నిబిడంస్కంధైశ్చతుర్భిస్తథా।
వ్యావృణ్వన్ భువనాంతరం పరిహరంస్తాపంసమోహజ్వరమ్।
యశ్శాఖిద్విజసంస్తుతః ఫలతితత్స్వాద్వద్యంరసాఖ్యంఫలమ్।
తస్మైశంకరపాదపాయమహతే తన్మస్త్రిసంధ్యంనమః॥

తా॥ కలిలో 2625 వ సంవత్సరమునకు సరియగు రక్తాక్షినామ సంవత్సర (క్రీ. పూ. 477) వైశాఖశుద్ధంబున మోక్షదాయకుండగు శ్రీమన్నారాయణునకుం బ్రియంబగు నేకాదశినాఁడు శ్రీశంకరులవారు శ్రీకామాక్షీదేవ్యాలయమునసుండు సమయంబున నాకస్మికంబుగఁ దమశరీరంబుం ద్యజింపఁదలఁచి యాక్షణంబ యొప్ప

వర్షప్రాయాఽపరిపూర్ణుండును, ప్రాపంచికజ్ఞాన పరిపూర్ణుండును ప్రా
జ్ఞుండును వర్ధమాన పుత్రుండును నగు నొక బాలునకు సన్న్యాసంబిచ్చి
సర్వజ్ఞమునియని నామధేయంబిడి తమయనంతర మాబాల ముని
చంద్రుని కామకోటిపీఠమున కధ్యక్షుంగా నియమించి తమశిష్యుల
లో శ్రేష్ఠులగు సురేశ్వరాచార్యుల నతనికి సంరక్షణకర్తగా నేర్ప
రచి తాము భూలోకమున నవతరించి చేయఁదలఁచిన కార్యముల
నెల్లఁ బరిపూర్తిగావించి ప్రజల కుపనిషత్తుల రహస్యార్థంబులనెల్ల
బోధించి స్వేచ్ఛగావహించిన మర్త్యశరీరము న్విడనాడి స్వకీయంబగు
బ్రహ్మతేజమును బొందిరి

శ్రీశంకరులనెడు కల్పవృక్ష మీభరతఖండమున మధ్యరా
ష్ట్రంబగు కాంచీమండలమునకుం బ్రధానపట్టణంబగు కాంచీనగర
మున దృఢములైన వేళ్లతో సుస్థిరముగా నిలువఁబడినదై తమ
చతుశ్శిష్యులంబోలిన యావృక్షముయొక్క నాలుగు ప్రకాండముల
నుండి వెలువడిన మిగుల దీర్ఘములగు శాఖలచే నితరరాష్ట్రములతో
సంతట వ్యాపించి తనసాంద్రచ్ఛాయచే నజ్ఞానమను జ్వరంబువలనఁ
గలుగు నాధ్యాత్మికాది తాపత్రయమును దొలఁగించుచు మిగుల
మధురమగు మోక్షానందమనెడు దివ్యఫలంబు వహించి యాఫలా
నుభవమునకై సర్వకాల సర్వావస్థలయందును దన్నాశ్రయించిన
పక్షులో యనఁదగు బ్రాహ్మణులచేఁ గొనియాడఁబడుచుఁ బ్రపంచ
మున నిట్లువెలయుచున్నది. అట్టి మహనీయుల కొఱకుఁ ద్రిసంధ్య
లయందును నమస్కృతుల నర్పించుచున్నాము.

9. ఇంకను, ఆనందగిరి ప్రణీతంబగు ప్రాచీనశంకర విజయము
లో నాదిశంకరులవారి జననకాల మీతీరున వివరింపఁబడి యున్నది.

శ్లో॥ ఈశోఽప్యభూత్సమద విద్వదభేద్యదర్ప
సర్పాహితుండికవిదగ్ధ సహస్రసేవ్యో।
విద్యాధిపత్యపరనామ్ని కులేశివాఖ్యాత్
ఆర్యాపతేరవిసహస్ర రుచిఃకుమారః॥

శ్లో॥ తిష్యే ప్రయాత్యనల శేవధిబాణనేత్రే
యోనందనేదినమణా వుదగధ్వభాజి।
రాధేఽదితేరుడుని నిర్గతమంగలగ్నేఽ
ప్యాహూతవాన్ శివగురుస్సచశంకరేతి॥

3 వ సర్గ-85, 86 శ్లోకములు.

తా॥ ఏ కేరళదేశమునందు సర్వతుల్యులగు విద్యావంతుల యొక్క దురహంకారమనెడు విషమును దొలఁగించుటకు సమర్థత గలిగిన వేలసంఖ్యగల పాములుపట్టెడు వాండ్రనెడు గొప్పపండితులఁగలరో అట్టివారిచే సేవింపఁబడుచుండు విద్యాధిపుండను వానివంశమునందు కలిప్రారంభమైనపిదప 2593 వ సంవత్సరమునకు సరియైన నందనవత్సరమునందుత్తరాయణమున వైశాఖశుద్ధ పంచమిరోజున పునర్వసునక్షత్ర యుతంబగు కర్కాటకలగ్నమునందు శివగురుదీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ గర్భమున భగవంతుఁడగు మహేశ్వరుండు సహస్రకిరణములుగల సూర్యుని తేజమువంటి తేజముతో నుద్భవించెను. ఆబాలునకు శివగురుదీక్షితుండు శ్రీ శంకరుండని నామధేయంబొసంగెను.

ఈగ్రంథమును రచియించిన "ఆనందగిరి" యనువారు శ్రీమదాచార్యులవారి భాష్యములకును, సురేశ్వరాచార్యులవారి వార్తికములకును వ్యాఖ్యానములం గావించినవారును, శ్రీకామకోటి పీఠమును "ఆనందజ్ఞానుల"ను నపర నామధేయముతో నలంకరించినవారునై యున్నారు.

మఱియు శ్రీమదాచార్యులవారు సిద్ధినొందిన కాలమును పై గ్రంథకర్తగారిటుల నిర్ణయించియున్నారు.

శ్లో॥ కల్యబ్దైశ్చశరేషు ణాధ్వనయనైః సత్కామకోటిప్రథే।
పీఠేనన్యస్యసురేశ్వరంసమవితుం సర్వజ్ఞసంజ్ఞం మునిమ్।

కామాఖ్యాస్సవిధేసజ్ఞాతు నివిశన్నున్మ క్తలోకస్పృహో।
దేహంస్వంవ్యపహాయదేహ్యాసుగమం ధామప్రపేదేపరమ్॥

తా॥ కలిలో 2625 వ సంవత్సరమున శ్రీశంకరభగవత్పాదులవారు కాంచీ కామకోటి పీఠమునందు సర్వజ్ఞమునులను వారిని దమకు వెనుకటి యాచార్యులంగా నియమించియు వారు మిగుల బాల్యదశయందున్నందున వారికి సంరక్షణకర్తగా సురేశ్వరాచార్యుల నేర్పఱచియు శ్రీకామాక్షీ దేవ్యాలయముంజేరి ప్రాపంచిక మనోరథంబులనెల్ల విడనాడి మర్త్యశరీరముం ద్యజించి సామాన్యమయిన మానవుల కలభ్యమయిన బ్రహ్మైక్యముం బొందినవారైరి.

10. మఱియు నిదివఱలో నుదాహరించిన గ్రంథములపైకి మిక్కిలి ప్రాచీనమగు శ్రీచిత్సుఖాచార్య కృత బృహచ్ఛంకర విజయములో నాదిశంకరులవారి జననకాలము వివరముగ నిట్లు కనబడుచున్నది.

| శు | ర బు | | చం |
|---|---|---|---|
| | ఆదిశంకరుల జాతక కుండలి. | | ల గు |
| కు | | | |
| | | శ | |

శ్లో॥ తతస్సాదశమేమాసే
సంపూర్ణశుభలక్షణే।
షడ్వింశేశతకే శ్రీమ
ద్యుధిష్ఠిరశకస్యవై॥

శ్లో॥ ఏకత్రింశేథవర్షేతు
హాయనేనందనేశుభే।
మేషరాశింగతేసూర్యే
వైశాఖేమాసిశోభనే॥

శ్లో॥ శుక్లేపక్షేచపంచమ్యాం, తిథ్యాంభాస్కరవాసరే।
పునర్వసుగతేచంద్రే, లగ్నేకర్కటకాహ్వయే॥

శ్లో॥ మధ్యాహ్నేచాభిజిన్నామా, ముహూర్తేశుభవీక్షితే।
స్వోచ్చస్థే కేంద్రసంస్థేచ, గురౌ మందేకుజేరవౌ॥

శ్లో॥ నిజతుంగగతేశుక్రే, రవిణాసంగతేబుధే।

ప్రాసూతతనయంసాధ్వీ, గిరిజేవషడాననమ్॥
శ్లో॥ ఉదయాచలవేళేవ, భానుమంతంమహౌజసమ్।
దుర్నిరీక్ష్యస్వతేజోభి, ర్భాసయంతందశోదశ॥

తా॥ అంతట, శుభసూచకములతోఁ గూడిన పదియవమాసము సంప్రాప్తముకాఁగా, యుధిష్ఠిర శకాబ్దంబులు 2631 కి సరియయిన నందన (క్రీ. పూ. 509) సంవత్సరమున వైశాఖశుద్ధపంచమి భానువారమునాఁడు పునర్వసునక్షత్రయుతంబగు నభిజన్ముహూర్తమునఁ గర్కాటకలగ్నమునందు రవి, కుజ, గురు, శనైశ్చరగ్రహము లుచ్చస్థితిని కేంద్రమునుబొంది మఱియు శుక్రుఁడుచ్చుఁడుగాను బుధుఁడు మేషరాశియందు రవితోఁగూడియు, నిట్లు శుభలక్షణములం గలిగియున్న సమయమున శివగురుదీక్షితుని ధర్మపత్నియగు నార్యాంబ పార్వతీదేవి కుమారస్వామిని బ్రసవించినట్లొకసుపుత్త్రుంగనెను. మఱియు నాబాలుఁ డుదయపర్వతమునుండి యుదయించు సహస్రకిరణునికాంతికి సమంబగు తనతేజముచేఁ బదిదిక్కులఁ బ్రకాశింపఁజేసెను.

పైఁగనిన శ్రీచిత్సుఖాచార్యులవారు శ్రీమదాచార్యులవారి సహాధ్యాయులుగను ప్రథమశిష్యులుగనునున్నారు. మఱియు వీరు కేరళదేశములోనుండు గోకర్ణక్షేత్రవాసులై పూర్వాశ్రమమున విష్ణుశర్మయను నామధేయంబున శ్రీశంకరుల వెంబడి శ్రీగోవింద భగవత్పాదులవారి సన్నిధానంబుఁజేరి వారితో నీభరతఖండంబునందంతటను సంచరించి శంకరభగవత్పాదులవారు శ్రీకామాక్షీదేవ్యాలయమునందు వారి శరీరమును ద్యజించి బ్రహ్మైక్యమును బొందినకాలమువఱకు విడువక వారి నాశ్రయించి యుండినట్లు వీరి గ్రంథమునఁ గనఁబడుచున్నది. మఱియుఁ బైగ్రంథమువలన వీరు శంకరులకంటె నైదుసంవత్సరములు పెద్దవారనియు తెలియుచున్నది. వీరు ద్వారకానగరమునందలి శారదాపీఠమును బ్రహ్మస్వరూపాచార్యులకుఁ బిదపఁ గలియుగమున 2654 వ సంవత్సరమునకు సరియగు

(క్రీ. పూ. 448) సంవత్సరములో నధిష్ఠించి కలిలో 2668 క పరి
యగు (క్రీ. పూ. 434) లో 80 సంవత్సరముల వయస్సున సిద్ధిఁ
జెందిరి.

ఇంకను శ్రీశంకరభగవత్పాదులవారు సిద్ధిఁజెందిన కాలమును
శ్రీచిత్సుఖాచార్యులవారు తమగ్రంథమున నిట్లువివరించియున్నారు.

శ్లో॥ అద్వైతమాతుహిన భూధరమాచసేతోః।
ఆధాయసర్వసుమనశ్శ్వ యసమ్మతార్థమ్।
త్యక్తాంకనాద్యవగుణా న్యపిషణ్మతాని।
శైవాదిమానిచనిరుచ్యయథాధికారమ్॥

శ్లో॥ వాణీంవిజిత్యచవియద్విశదానుదేహామ్।
సర్వజ్ఞపీఠమధిరుహ్యచ తత్రకాంచ్యామ్।
విద్వద్వరార్చితపదోయమి సార్వభౌమో।
దేవ్యాఃపురఃపరతరేపురుషేవిలిల్య॥

శ్లో॥ వహ్న్యధ్వశాస్త్రనయనాంకయుధిష్ఠిరాబ్దే।
ద్వాత్రింశతంహిశరదో ధరణీంవిభూష్య।
శ్రీశంకరేంద్రగురురాట్ శ్రితరాజసేనః।
సంశిష్యధర్మమఖిలం శివతాంప్రపేదే॥

తా॥ ఆసేతు హిమాచలపర్యంతము సకల శాస్త్రజ్ఞులకును
సమ్మతమగు నద్వైతమును స్థాపించియు, శూలచక్రాది చిహ్నముల
ధరించియుండిన శైవ వైష్ణవాది షణ్మతస్థులను పై దురాచారముల
నుండి తొలఁగించి సన్మార్గప్రవిష్టులంగావించియు, ఆకసమున గోచ
రించిన వాణిని జయించి పండితోత్తమ సేవ్యులై కాంచీనగరమునం
దలి సర్వజ్ఞపీఠము నారోహించియు, శ్రీశంకరయతి సార్వభౌము
లీభరతఖండమున ముప్పదిరెండు సంవత్సరకాలము వర్తిల్లి తమ్మా
శ్రయించిన కాంచీమండలమునకుం బ్రభువగు రాజసేన భూపాలున
కును సమస్తప్రజలకును శాశ్వత సుఖప్రాప్త్యుపాయంబులగు ధర్మం
బుల బోధించి, యుధిష్ఠిరశకములో 2663 వ సంవత్సరమునకు పరి

యగు (క్రీ. పూ. 477) సంవత్సరములో శ్రీకామాక్షీదేవ్యాలయమున దమమర్త్యశరీరమును త్యజించి బ్రహ్మైక్యమునుబొందిరి.

పైనుదాహరించిన యుధిష్ఠిరశక ప్రారంభమెప్పుడనిన:—

భగవదవతార పురుషులగు శ్రీకృష్ణమూర్తి వారిమానవ శరీరమువిడిచి వైకుంఠమున కరిగినవెంటనే యనఁగా, క్రీస్తుపుట్టుటకు 3102 సంవత్సరములకుముందు కలియుగము ప్రారంభమయ్యెను.

కలిప్రారంభమునకు 37 సంవత్సరములకుం బూర్వము పాండవ కౌరవుల మధ్య భారతయుద్ధము జరిగెను. ఆయుద్ధాంతమున నెఱవేఱిన యుధిష్ఠిర పట్టాభిషేకమహోత్సవ తర్ణుణమున క్రీస్తు పుట్టుటకు 3139 సంవత్సరములకుముందు యుధిష్ఠిరశకము స్థాపింపఁబడియె.

హైందవుల పురాణాది ప్రాచీన గ్రంథములలోఁ బైశకము కనఁబడుటయేగాక ఉత్తరహిందూస్థానములో నీశకము విశేషముగ వాడఁబడుచున్నది. (తంగ్లం శంకరనారాయణశాస్త్రులు, B. A., B. L. గారు రచించిన "The Age of Sankara" అను గ్రంథము యొక్క మొదటి భాగమునందు 20 వ పుటలోఁ బై విషయముఁ జూడనగును.)

11. ఇఁక, శంకరులవారి యవతారకాలమును గుఱించి వారీ భరతఖండమున నాల్గుదిక్కులలో స్థాపించిన మఠములకు సంబంధించిన గురుపరంపర పట్టికలు మొదలగు సాధనములు విమర్శింపఁ బడును.

శంకరభగవత్పాదులవారు స్థాపించిన యైదుమఠములపైకి బదరికాశ్రమముననుండు మఠము శిలమై యధ్యక్షులు లేక యుండుఁజరుగఁదగిన కార్యములు బొత్తిగనిలిచియున్నవి. మఱియు జగన్నాథమునందుండు మఠముయొక్క గురుపరంపర పట్టికదొరకలేదు.

ప్రకృతము నాకులభించిన పట్టికల ననుసరించి తక్కిన మూఁడు మఠముల వృత్తాంత మెట్టిదనిన:—

శృంగగిరి పీఠముయొక్క గురుపరంపర పట్టిక సమగ్రముగా నుండలేదు. ఆపీఠము నలంకరించిన యాచార్యులపైకి తొమ్మిదవ వారగు విద్యాశంకరులు క్రీ. శ. 6 వ శతాబ్దములో సిద్ధిఁజెందిన పిదప నామఠమునకు సుమారెనిమిదివందల సంవత్సరము లధ్యక్షులే లేక యిటీవల విద్యారణ్యులవారి పరమగురువులగు విద్యాతీర్థుల వారి యభిమతానుసారముగ విద్యారణ్యులవారు క్రీ. శ. 14 వ శతాబ్దమున భారతీ కృష్ణతీర్థులనువారిని పై మఠాధిపతులనుగ నియమించినట్లును వారికిఁబిదప విద్యారణ్యులవారి దినములలో పై మఠము చాలనభివృద్ధిఁబొంది తదాదిగ మంచిస్థితిలో నుండులాగునను తెలియవచ్చుచున్నది. మఱియు శృంగగిరి పీఠముయొక్క గురుపరంపరవలన శంకరభగవత్పాదులవారు కలిలో 3058 వ సంవత్సరమునకు సరియగు నీశ్వర సంవత్సరము (క్రీ. ము. 44) లో వైశాఖ శుద్ధ పంచమినాఁడు ఆర్ద్రానక్షత్ర యుతంబగు మిథునలగ్నమున జన్మించినట్లు కనఁబడును.

మఱియు ద్వారకలోనుండు శారదాపీఠము నిదివఱలో నలంకరించియుండిన యాచార్యస్వాములవలన "విమర్శ" యను గ్రంథమునఁ బ్రచురపఱుపఁబడిన వృత్తాంతమువలన శ్రీమదాచార్యస్వాములవారు యుధిష్ఠిరశకములో 2631 వ సంవత్సరమున వైశాఖశుద్ధ పంచమిరోజున జన్మించినట్లేర్పడును. పైఁగనఁబఱచిన కాలమునకు క్రీ. ము. 509 యే యగుచున్నది. ఇదియునుంగాక కాంచీ కామకోటిపీఠముయొక్క గురుపరంపర పట్టికవలన నాది శంకరులవారు కలిలో 2593 వ సంవత్సరమునకు సరియయిన నందనసంవత్సర వైశాఖమాసమున పునర్వసునక్షత్ర యుతంబగు శుక్లపక్ష పంచమి రోజున జన్మించినట్లగపడుచున్నది. మఱియు కామకోటి పీఠాధిపతులవలన వ్రాయఁబడి యీవల నాపీఠము నలంకరించిన సర్వజ్ఞ సదాశివబోధేంద్ర సరస్వతీస్వాములవారివలన సంవత్సరక్రమముగఁ గూర్పఁబడి ప్రచురపఱుపఁబడిన "పుణ్యశ్లోక మంజరి" అన్నఁగా, ఆ

యాకాలములో సిద్ధిఁజెందిన పీఠాధిపతులంగూర్చి జ్ఞాపకార్థము సంగ్రహముగ వ్రాయఁబడిన వృత్తాంతములో, ఆదిగురువులవారు సిద్ధిఁజెందిన కాల మీతీరున వివరింపఁబడియున్నది.

శ్లో॥ మహేశాంశాజ్జాతో మధురముపదిష్టాద్వయనయో।
మహామోహధ్వాంత ప్రశమనరవిః షణ్మతగురుః।
ఫలేస్వస్మిన్ స్వాయుష్యపి శరచరాబ్దేఽపిచకలే।
ర్వ్యలిల్యేరక్తాక్షిణ్యధివృషసితై కాదశిపరే॥

తా॥ షడ్దర్శన సమ్మతంబగు సద్వైతమతమును స్థాపించియు శైవవైష్ణవాది షణ్మతములయందలి దురాచారములను ఖండించి వానిని బాగుపఱచియు, అజ్ఞానాంధకారముం బోఁగొట్టె రెండవసహస్రకిరణుఁడయి వెలయుచుండిన శ్రీమహేశ్వరావతార పురుషులును జగద్గురువులవారునగు శ్రీశంకరాచార్య స్వాములవారు కలిలో 2625 వ సంవత్సరమునకు సరియగు రక్తాక్షిసంవత్సరమున (క్రీ. ముం. 477) శుద్ధయేకాదశినాఁడు బ్రహ్మైక్యముం బొందిరి.

శ్రీశంకర భగవత్పాదులవారి భరతఖండమున 32 సంవత్సరములకాలమువఱకు వర్ధిల్లి యాయల్పకాలములోనే నాలుగుదిక్కులకువెళ్లి దిగ్విజయంబు గాంచిరనుట వారిచరిత్రమును వ్రాసిన గ్రంథకర్తలందఱు నొప్పుకొనఁదగిన యంశముగనే యున్నది. వారు సిద్ధిఁజెందిన కాలమునుబట్టి లెక్కచేసినను వారవతరించిన కాలము (క్రీ. ముం. 509) అనియే నిస్సంశయముగ నేర్పడుచున్నది.

మఱియు పైఁగనిన "పుణ్యశ్లోకమంజరి" ననుసరించి కామకోటి పీఠాధిపతులలో నేఁబదియైదవవారగు శ్రీపరమశివేంద్ర సరస్వతిస్వాములవారి శిష్యులగు సదాశివ బ్రహ్మేంద్ర స్వాములవారివలన రచియింపఁబడినదియు నాపీఠాధిపతులయొక్క యోగ్యతాంశములు మొదలగువానిని స్తోత్రపూర్వముగఁ దెలుపునట్టిదియునగు "గురురత్నమాల" అను గ్రంథమువలనఁగూడఁ బై కాలమే దృఢీకరింపఁబడియున్నది.

12. ఇఁక నన్యమతస్థుల గ్రంథమగు జినవిజయమునందు శ్రీమదాచార్యస్వాములవారు వర్ధిల్లిన కాలమును దెల్పునట్టివృత్తాంతమును వివరించెద.

క్రీస్తుపుట్టుటకుముందు 598 వ సంవత్సరమున *వర్ధమానుఁడను క్షత్రియుఁడు జన్మించి తన బుద్ధి చాతుర్యము వలనను వాగ్ధోరణి చేతను జనుల వశపఱచుకొని బౌద్ధ మతమునకు సాటిగ వేదవిరుద్ధమగు జైనమతమును స్థాపించి తన బలపరాక్రమములచే ననేకక్షత్రియ ప్రభువుల జైనమతావలంబకులుగ నొనర్చి మహావీరుఁడని ప్రఖ్యాతిఁ గాంచె. వీనివద్దనే కుమారిలభట్టాచార్యులు గూఢముగ జైన రహస్యమును దెలిసికొని పిదప నా మతమును ఖండించెను. జినవిజయమనఁగా, జైనమతమును స్థాపించిన "జినుఁడను" వర్ధమానుని చరిత్రములో, కుమారిల భట్టాచార్యులవారు జన్మించినకాల మిట్లు నిర్ణయింపఁబడియున్నది.

శ్లో॥ ఋషిర్వార స్తథాపూర్ణం మర్త్యాక్షౌ వామమేళనాత్।
ఏకీకృత్యలభేతాంకః క్రోధీస్యాత్ తత్రవత్సరః॥

శ్లో॥ భట్టాచార్యకుమారస్య కర్మకాండైకవాదినః।
జ్ఞేయః ప్రాదుర్భవ స్తస్మిన్ వర్షే యౌధిష్ఠిరేశకే॥

తా॥ పై ఋష్యాదుల సంఖ్యలఁ దలక్రిందుగఁ గూర్పఁగా నేర్పడు యుధిష్ఠిరశకములో 2077 వ సంవత్సరమునకు సరియగు క్రోధిసంవత్సరమున కర్మమార్గ ప్రవర్తకులగు కుమారిల భట్టాచార్యులు జన్మించిరి.

---

* మహావీరవర్ధమానుఁడు చనిపోయిన కాలమనఁగా (క్రీ. పూ. 527) మొదలు లోక శకమారంభమైనట్లును నతఁడు 71 వ ప్రాయమునఁ గాలగతినొందినట్లును జైనప్రబంధములలోఁ జెప్పఁబడియుండుటవలన నతఁడు క్రీ.పూ. 598లో జన్మించియుండవలయును. (తండ్లం శంకరనారాయణశాస్త్రిలు B. A., B. L. గారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B. భాగములో 184 వ పుటయందలి వివరణమును చూడుఁడు.)

(కొల్హాపురము విద్యావాచస్పతి పండిత అప్పాశాస్త్రిలవారి వలన రచియింపఁబడిన "సంస్కృత చంద్రిక" యను పత్రికయొక్క 9 వ సంపుటమున 8 వ పుటను చూడుఁడు.)

జైనులును, బౌద్ధులును, కలియుగము పుట్టిన 468 సంవత్సరములకుఁ బిదప నెనఁగా (క్రీ. ముం.) 2634 లో యుధిష్ఠిరశకము ప్రారంభమైనట్లు వ్యవహరించుటవలన పై యుధిష్ఠిరశకంబున 2077 కి సరియగు కలివర్షంబులు 2545 కి (క్రీ. ముం. 557) సరిపోవుచున్నది.

(జైనబౌద్ధాదులచే వ్యవహరింపఁబడు యుధిష్ఠిరశక ప్రారంభమును గుఱించి T. S. నారాయణశాస్త్రిలవారు వ్రాసిన "The Age of Saukara" అను గ్రంథముయొక్క ప్రథమభాగమున 20 వ పుటను చూడఁదగును.)

మఱియు చిత్సుఖాచార్యులు "బృహచ్ఛంకర విజయ"మను గ్రంథమున కుమారిల భట్టాచార్యులు శంకరులకంటె 48 సంవత్సరములు వృద్ధులని వ్రాసియున్నారు. పై కాలనిర్ణయము వారి యభిప్రాయము ననుసరించి యున్నది.

ఇదియునుంగాక కుమారిల భట్టాచార్యులవారిని శంకరభగవత్పాదులవారు సందర్శించిన కాలముంగూర్చి యదే జినవిజయమున నిట్లు వివరింపఁబడియున్నది.

శ్లో॥ పశ్చాత్ పంచదశేవర్షే శంకరస్యాగతేసతి।
భట్టాచార్యకుమారస్య దర్శనంకృతవాన్ శివః॥
(సంస్కృత చంద్రిక 9 వ సంపుటము 6 వ పుట.)

తా॥ శంకరులవారికి 15 సంవత్సరములు పూర్తియైనతర్వాత వారు ప్రథమమున కుమారిల భట్టాచార్యులవారిని సందర్శించిరి.

ఈకాలము (క్రీ. ము. 494) కుమారిల భట్టాచార్యులవారి యవసానసమయము గనుక నాకాలముంబట్టి లెక్కచేసినను శంకరుల జననకాలము క్రీ. ము. 509 గానే యేర్పడును.

మఱియు, శంకరులవారు సిద్ధిఁజెందిన కాలము పై గ్రంథమున

నిట్లుదాహరింపఁ బడియున్నది.

శ్లో॥ ఋషిర్బాణ స్తథాభూమి ర్మర్త్యాక్షౌ వామమేళనాత్।
ఏకత్వేనలభేతాంక స్తామ్రాక్ష స్తత్రవత్సరః॥

(సంస్కృతచంద్రిక 9 వ, సంపుటము, 6 వ, పుట.)

తా॥ పై ఋష్యాది సంఖ్యలఁ దలక్రిందుగాఁ జేర్పఁగా నేర్పడు యుధిష్ఠిర శకమున 2157 వ సంవత్సరమునకు తామ్రాక్ష (రక్తాక్షి) సంవత్సరము సరిపోవును.

ఈకాలము కలిలో 2625 వ సంవత్సరముగ నేర్పడుటచే నా కాలమునకు క్రీ. ముం. 477 సరిపోవుచున్నది. ఈకాలమే "ప్రాచీన శంకరవిజయము" లలో శంకరులవారు సిద్ధిఁజెందిన కాలమని చెప్పఁ బడియున్నది.

మఱియు, శంకరభగవత్పాదులవారు 32 సంవత్సరములు మాత్ర మీభరతఖండమున వర్ధిల్లి యమానుషకార్యములఁ గావించి నట్లు పై శంకరవిజయములవలనఁ గనఁబడును. కనుకఁ బైఁగనిన వారి వయస్సునుబట్టియు వారవతరించిన కాలము క్రీ. ముం. 509 యనియే దృఢపడుచున్నది.

మఱియు, పైనుదాహరించిన జినవిజయమున సుధన్వమహా రాజుంగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ సుధన్వనామకో రాజా సోపిదుష్ట స్తథాభువి।
జినానాం యేనసాధూనాం కృతంకదనమద్భుతమ్॥

(సంస్కృత చంద్రిక 9 వ సంపుటము, 6 వ పుట.)

తా॥ ఆ దుష్టప్రభువగు సుధన్వుఁడుగూడ నదే కాలమున వర్ధిల్లెను. వానిప్రభుత్వకాలమున ధర్మిష్ఠులగు జైనులు మిక్కిలి హింసింపఁబడిరి.

ఇందువలన సుధన్వమహారాజు కుమారిల భట్టాచార్యుల వారి కాలములోను శంకరులవారి జీవితదశయందును నున్నట్లు కనఁబడుచున్నది.

పై వివరించినరీతిగా జైనగ్రంథమువలనఁగూడ శ్రీశంకర భగవత్పాదులవారు క్రీ. పూ. 5 వ శతాబ్దాంతమున వర్ధిల్లినట్లు నిస్సంశయముగ నేర్పడుచున్నది.

13. ఇదియునుంగాక, జైనమతస్థుఁడును ద్వారకాధిపతియు నగు సుధన్వమహారాజు, కుమారిల భట్టాచార్యులవారివలన వైదిక కర్మానుష్ఠాన యోగ్యమగు హిందూ మతమునందుఁ జేర్పఁబడినవాఁడై యుధిష్ఠిరశకములో 2649 వ సంవత్సరమునకు సరియగు క్రీ. పూ. 490 లో శ్రీమదాచార్యులవారి శిష్యుఁడయ్యెను. అదిమొదలు వారి నాశ్రయించి దిగ్విజయార్థము వారువిజయముచేసిన ప్రదేశముల కెల్లఁ దానునుపోయి, వారివెంబడి తిరుగుచు వారికి సహాయభూతుఁడైయుండి యుధిష్ఠిరశకమున 2663 వ సంవత్సరము (క్రీ. పూ. 478) ఆశ్వయుజ శుక్ల పౌర్ణిమరోజున శంకరభగవత్పాదులవారి మహాత్కార్యములనెల్లఁ గనఁబఱచి "విజ్ఞానపత్రిక" యను నొక తామ్రపత్రాను శాసనమును బ్రకటించెను. (ద్వారకలోనుండు శారదాపీఠము నిదివఱలో నలంకరించియుండిన యాచార్యులవలనఁ బ్రచురపఱుపఁబడిన "విమర్శ" యను గ్రంథమున 29 వ పుటను చూడుఁడు.)

పై శాసనమువలనఁగూడ, సుధన్వునికాలమున నాచార్యస్వాములవారున్నట్లు కనఁబడును.

14. మఱియు, పాశ్చాత్యులు వ్రాసిన హిందూదేశపు ప్రాచీన చరిత్రయందు గౌతమబుద్ధుఁ డెనుబదవప్రాయమున క్రీ. పూ. 543 లో మృతిఁబొందినట్లు కనఁబడును. ఈవృత్తాంతమును గొంద ఱాధారముగఁ జేసికొని, బుద్ధునికిఁబిదప స్వల్పకాలములోనే శ్రీశంకరులవతరించిరనుట, అంతసమంజసముగ నుండలేదని వక్కాణించుచున్నారు. అట్టి సంశయమును నివర్తిచేయుటకై బుద్ధుఁడు వాసిఁగాంచిన కాలమును నిష్కర్షగఁ దెలుపఁదగియున్నది. కనుక నాకాలమునుగూడఁ దెలిపెద.

గౌతమబుద్ధుఁడు సూర్యవంశపు రాజులలోఁ గడపటివాఁడగు సుమిత్రునికి ముందు 7 వ పురుషుఁడగు శుద్ధోదనుని కుమారుఁడు. సూర్యవంశపు రాజులయొక్క ప్రభుత్వ కాలమును దెలుపు కలియుగ రాజ వృత్తాంతమను గ్రంథమువలన బుద్ధుఁడు క్రీ. పూ. 1887 లో జన్మించి క్రీ. పూ. 1807 లో మృతిఁ బొందినట్లు తెలియుచున్నది. మఱియు, మగధరాజ్యమునేలిన ప్రభువులలో శిశునాగవంశములోఁ జేరిన 5 వ పురుషుఁడగు "వింధ్యసేనుఁడను బింబిసారుఁడు" గౌతమబుద్ధునికంటె 5 సంవత్సరములు చిన్నవాఁడనియు, బింబిసారుని కుమారుఁడగు నజాతశత్రువు ప్రభుత్వమునకు వచ్చిన 8 సంవత్సరములకు బుద్ధుఁడు 80 సంవత్సరముల ప్రాయమున చనిపోయినట్లును, బౌద్ధ జైన గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. అజాతశత్రువుయొక్క ప్రభుత్వకాలము, హైందవుల పురాణములవలన క్రీ. పూ. 1815 మొదలు క్రీ. పూ. 1788 వఱకు లోఁబడినకాలమని యేర్పడుటచే బుద్ధుఁడు క్రీ. పూం. 1887 లో జన్మించి క్రీ. పూం. 1807 లో మృతిఁబొందినట్లు దృఢపడుచున్నది. మఱియు, కల్హణకవీంద్రునిచే రచియింపఁబడిన "రాజతరంగిణి" యందుఁగూడఁ బై కాలనిర్ణయమే కనఁబడుచున్నది.

(T. S. నారాయణశాస్త్రిలు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B భాగమునకనుబంధమగు "మగధరాజుల వృత్తాంతము" లో 21 వ పుట మొదలు, 23 వ పుటవఱకుఁ జూడుఁడు.)

వాస్తవాంశ మిట్లుండ హిందూదేశపుఁ బ్రాచీన చరిత్రమును వ్రాసిన "Mr. V. A. Smith" (వి. ఎ. స్మిత్) మొదలగు పాశ్చాత్యులు, మహావీరవర్ధమానుఁడును బుద్ధుఁడును సమకాలికులని యభిప్రాయపడిన విషయము, మిగుల శోచనీయము.

15. ఇదియునుంగాక శంకరులువర్ధిల్లిన కాలమునుగూర్చి మఱికొన్ని నిదర్శనము లగపడుచున్నవి.

మగధరాజ్యమునేలిన యాంధ్రవంశపురాజులలో పదునెనిమిదవ పురుషుఁడగు "హాలుని" కాలములో శ్రీశంకర భగవత్పాదుల వారు వాసిఁగాంచినట్లు బృహచ్ఛంకర విజయమునందును, గురురత్నమాలలోను, నిర్ణయింపఁబడియున్నది. పై హాలుఁడను ప్రభువు యుధిష్ఠిరశకమున 2644 కి సరియగు క్రీ. ము. 495 మొదలు పై శకములో 2649 కి సరియగు క్రీ. ము. 490 వఱకు రాజ్యభారమును వహించినట్లు వాయు, మత్స్య, విష్ణు, బ్రహ్మాండాది పురాణములు సహిత ముద్ఘోషించుచున్నవి.

(నారాయణశాస్త్రిలవారు రచియించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B భాగమునందలి మగధ రాజ్యమును పరిపాలించిన ప్రభువుల వృత్తాంతములో 98 వ పుటయం దీవిషయము జూడనగును.)

16. మఱియు, శ్రీహర్ష విక్రమాదిత్యుఁడు చంద్రశర్మయను పూర్వాశ్రమ నామధేయంబుగల గోవింద భగవత్పాదులవారికి క్షత్రియస్త్రీయందుఁ బూర్వాశ్రమమున జన్మించిన పుత్రుఁడు. ఇతఁడు శంకరులకాలమున నుజ్జయినీ చక్రవర్తిగ నుండినట్లు బృహచ్ఛంకర విజయమువలనఁ దెలియవచ్చుచున్నది.

మఱియు, పారసీకరాజ్యంబునకుఁ బ్రభువగు "డెరయస్" అనువాఁడు క్రీ. ము. 6 వ శతాబ్దాదియందనఁగా (క్రీ. ముం. 509 లో) హిందూదేశమునకుఁ బశ్చిమోత్తర భాగమున సింధునదికిఁ దూర్పుగఁ గొంతభాగము నాక్రమించి యాప్రదేశమును గొన్ని చిన్నచిన్న రాజ్యములుగ విభాగించెను. వానిం బాలించినవారు పారసీకరాజ్యములోఁ జేరిన "శకే" యను దేశమునుండివచ్చిన వారగుటం జేసి వారికి శకులని నామధేయంబుగలిగె. ఈ పారసీకుల తెగలోఁ జేరిన శకులు క్రీ. ము. 5 వ శతాబ్దములోఁ బై వివరించిన శ్రీహర్ష విక్రమాదిత్యునిపై యుద్ధమునకు వెడలిరి. విక్రమాదిత్యుఁడు వారితోఁ బోరి యుద్ధమున వారినోడించి "శకారి" యని ప్రఖ్యాతిఁ

గాంచె. మఱియు నతఁడు శకులనోడించిన కాలమైన క్రీ. ము. 457 మొదలు తనపేర నొకశకమును స్థాపించెను.

(Vide Alberuni's India, translated and published by Dr. Edward. C. Sachau, Vol. II, Chap. 49, Page 7.) "ఆల్ బెరూని" అను మహమ్మదీయునిచే రచింపఁబడి "డాక్టర్ ఎడ్వర్డు సి. సచౌ" అను వానివలన హూణభాషకు తర్జుమాచేయఁబడి ప్రకటింపఁబడిన హిందూదేశ చరిత్రయందలి రెండవసంపుటమున 49 వ యధ్యాయములో 7 వ పుటనున్ను (Vide also Kalhan's Rajatharangini Vol. III, Pages 124 to 129 కల్హణకవీంద్రునిచే రచింపఁబడిన "రాజతరంగిణి" అను గ్రంథముయొక్క 3 వ సంపుటమున 124 వ పుటమొదలు 129 వ పుటవఱకును నీవిషయముంజూడనగును.

మఱియు, ఇతఁడు గోవింద భగవత్పాదులవారు క్రీ. ము. 494 లో నర్మదానద మధ్యప్రదేశంబున "వైడూర్యమణి" యను పర్వతంబుననుండు మాంధాతద్వీపమున "ఓం" అను ప్రణవమునుచ్చరించుచు సిద్ధిఁజెందిరని విని, వెంటనే యాద్వీపమునకరిగి వారి సమాధికి సమీపంబున "ఓంకారనాథాలయము"ను నొక యాలయముంగట్టించెను. ఆక్షేత్రమిప్పటికిని గొప్ప యాత్రాస్థలముగనున్నది.

(T. S. నారాయణశాస్త్రిలవారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క ప్రథమభాగమున 102 వ పుటను చూడుఁడు.)

పై విక్రమాదిత్యుఁడుగాక, గుప్తవంశమునఁజేరిన సముద్రగుప్తుని కుమారుఁడగు రెండవ చంద్రగుప్తుఁడును, విక్రమాదిత్యుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇతఁడు మాళవ ఘూర్జరదేశముల మీఁదుగా తనసైన్యమును గొనిపోయి సురాష్ట్రమనెడు (కాఠియావార్) ద్వీపకల్పము నేలుచుండిన పారసీకతెగలోఁ జేరినవారును

విదేశీయులునగు "శకులను" హిందూదేశమునుండి వెడలఁగొట్టి పై ద్వీపకల్పము నాక్రమించుకొని యరేబియా సముద్రమువఱకు తన రాజ్యమును విస్తరింపఁజేసి, యుత్తరహిందూస్థానమునకెల్లఁ బ్రభువై విక్రమాదిత్యుఁడని బిరుదువహించెను. వీనికిని, "శకారి" విక్రమాదిత్యుఁడని ప్రఖ్యాతిగలదు.

ఇతఁడు క్రీ. ముం. 3 వ శతాబ్దమనఁగా క్రీ. ము. 270 లో మగధరాజ్యమునకుఁ బ్రభువయ్యెను.

(నారాయణ శాస్త్రిలవారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B భాగమునందలి మగధ రాజ్యప్రభువుల వృత్తాంతములో 123 & 124 పుటలనుజూడుఁడు.)

ఇంకను, మాళవదేశాధిపతియగు మఱియొక విక్రమాదిత్యుఁడును కలఁడు. అతఁడు ప్రభుత్వమునకువచ్చిన కాలమైన క్రీ. ము. 57 వ సంవత్సరము మొదలతనిపేరనొక శకము ప్రారంభమయ్యెను.

(పై నుదాహరించిన నారాయణశాస్త్రిలవారి గ్రంథముయొక్క ప్రథమభాగమున 25 వ పుటను చూడుఁడు.)

ఇతఁడే శ్రీహర్ష విక్రమాదిత్యుఁడనియు నితనికాలమునసే శ్రీశంకరులు వర్ధిల్లిరనియు, కొందఱు పొరపాటుగ నభిప్రాయపడి యున్నారు.

17. ఇదియునుంగాక, నేపాళదేశాధిపతియగు వృషదేవవర్మయొక్క ప్రభుత్వకాలమున శ్రీశంకరులు నేపాళంబునకు విజయముచేసినట్లు పరంపరాశ్రుతమగు వదంతి కలదనుటయేకాక మండనమిశ్రుల పరంపరలోఁ జేరిన సుబ్రహ్మణ్యయ్యగారివలన హిందూస్థాని భాషనుండి యఱవభాషకు తర్జుమాచేయఁబడిన "జగద్గురు శ్రీశంకర భగవత్పాదులవారి చరిత్ర" యందును నీవిషయ మగపడును.

పై వివరించిన నేపాళదేశాధీశ్వరుఁడు క్రీస్తుపుట్టుటకు సుమారు 500 సంవత్సరములకు బూర్వము నేపాళదేశమును పాలించుచుండెను. ఇతఁడు సూర్యవంశపురాజులలోఁ బదునెనిమిదవ పురుషుఁడు.

(Vide "The Parvatiya Vamsavali, given in the Indian Antiquary, Vol. XIII, pages 411 to 428, by Pandit Bhagavan Lal Indraji, Honorary member of the Royal Asiatic Society.

ఆసియాఖండపు రాజకీయసభలో గౌరవనీయ సభ్యుఁడగు "భగవాన్ లాల్ ఇంద్రాజీ" అను పండితుఁడు హిందూదేశము యొక్క ప్రాచీనవృత్తాంతమను గ్రంథమునందలి 13 వ సంపుటములో 411 మొదలు 428 వఱకుఁగల పుటలలోఁ బ్రచురపఱచిన "పార్వతీయ వంశావళి" అను నేపాళ దేశాధిపతుల వంశక్రమమును జూడుఁడు.)

పై వంశావళిలో నేపాళరాజ్యమునేలిన యనేకవంశములకుఁ జేరిన ప్రభువుల నామధేయము లగపడుచున్నవి. వానిలో నైదవ వంశమగు సూర్యవంశపు రాజులలో మొదటివాఁడగు "భూమివర్మ" కలియుగమునందు 1389 వ సంవత్సరమునకు సరియగు క్రీ. ము. 1712 వ సంవత్సరమున రాజ్యభారము వహించినట్లును, మఱియు నావంశములో ముప్పదియొక పురుషులు ప్రభుత్వము చేసినతర్వాత ఠాకూరివంశమను నాఱవవంశమువారిలో మొదటివాఁడగు "అంశువర్మ" కలియుగములో 3000 సంవత్సరములకు సరియయిన క్రీ. ము. 101 లోఁ బ్రభువైనట్లును తెలియవచ్చుచున్నది.

కనుక వృషదేవవర్మ క్రీస్తుకు 500 సంవత్సరములకుఁ బూర్వము ప్రభుత్వము చేయుచుండెనను విషయమయి సంశయమేమియుఁ గనఁబడదు.

అట్లుండియు, నేపాళదేశపుఁ బ్రభువులలో సూర్యవంశమున నిరువదియేడవవాఁడును, క్రీ. ము. 338 లో ప్రభువుగ నున్నవాఁడు నగు "శివదేవవర్మ" వలన దయచేయింపఁబడిన యొకశాసనమున నుదాహరింపఁబడినట్టిదియు నేపాళమున వ్యవహరింపఁబడునదియు నగు శ్రీహర్షశకమనఁగా, ఉజ్జయిని చక్రవర్తిగనుండిన శ్రీహర్ష

విక్రమాదిత్యుని పేర క్రీస్తుపుట్టుటకు 457 సంవత్సరములకుఁ బూర్వము ప్రారంభమైన శకమును, క్రీ. వె. 7 వ శతాబ్దాదిలో మగధరాజ్యమునకుఁ బ్రభువుగనుండిన హర్షవర్ధన శిలాదిత్యుని పేరఁ బ్రారంభమయిన శకమని, "Dr. Fleet" (డాక్టర్ ఫ్లీటు) మొదలగు పాశ్చాత్య పండితులు పొరపాటుపడి నేపాళదేశపు వంశావళి సరికాదనియు, శ్రీమదాచార్యస్వాములవారి కాలములోఁ బ్రభువుగనుండిన వృషదేవవర్మ, క్రీ. వె. 7 వ శతాబ్దములో నేపాళదేశమునకుఁ బ్రభువుగనుండెననియు, వృథాశంకలను గలుగఁజేసిరి.

(నారాయణశాస్త్రిలు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క ప్రథమభాగమునందలి 25 వ పుటయందుండు వివరణమును జూడుఁడు.)

అయినను, "అల్ బెరూని" యను మహమ్మదీయుఁడు హిందూదేశమును గుఱించి వ్రాసిన పైనుదాహరింపఁబడిన చరిత్రమునందు నేపాళదేశములో శ్రీహర్ష విక్రమాదిత్యుని పేర నొక శకము వ్యవహరింపఁబడు చుండెననియు, ఆశకము క్రీ. ము. 457 లోఁ బ్రారంభమయినట్లును వ్రాసియున్నాఁడు.

మఱియు, హర్షవర్ధన శిలాదిత్యుని పేర నొకశకము ప్రారంభమయినట్లు నిదర్శనమును గనపడలేదు. ఆతనికాలములో చైనాదేశమునుండి మనదేశమునకు వచ్చిన (Hiuen Tsang) హ్యూవన్ త్స్యాంగ్ అను వాఁడు మనదేశమున క్రీ. వె. 629 మొదలు క్రీ. వె. 645 వఱకు సంచారము చేయుచుండెను. ఇతనుగాని, హర్షవర్ధన శిలాదిత్యుని రాజస్థానములో నాస్థానపండితుఁడుగనుండి యతని చరిత్రమును వ్రాసిన బాణకవిగాని యతని పేరనొక శకము ప్రారంభమైనట్లొక యక్షరముకూడ వ్రాసియుండలేదు. పై కారణములవలన శ్రీమదాచార్యులవారు వృషదేవవర్మ ప్రభుత్వకాలములో నేపాళదేశమునకు విజయముచేసిన తరుణము క్రీ. ము. 5 వ శతాబ్దాంతముగ నుండవచ్చునని దృఢముగఁ జెప్పఁదగియున్నదే కాని పాశ్చా

త్ర్యు లభిప్రాయపడిన ప్రకారము క్రీ. వె. 7 వ శతాబ్ద మెంతమాత్రమును కాదు.

18. ఇదియునుంగాక, మగధరాజ్యమునేలిన ప్రభువులపైకి ఆంధ్రవంశపుఁ బ్రభువగు "హాలుని" కాలములో శంకరభగవత్పాదులవారు వర్ధిల్లినట్లు మన ప్రాచీనగ్రంథములవలన నగపడెడులాగునను, ఆప్రభువు క్రీ. ము. 5 వ శతాబ్దాంతమున మగధరాజ్యము నేలినట్లు మన పురాణములలోఁ జెప్పఁబడియుండునట్లును, ఇదివఱలో వివరించియున్నాను.

ఇఁక, పై ప్రభువుయొక్క ప్రభుత్వకాలమును గుఱించి భిన్నాభిప్రాయము లుండుటవలన, మనపురాణములలో వివరించియుండు కాలమే యుచితమని నిరూపింపఁబడును.

హిందూదేశచరిత్రము వ్యవహారరీతిగను, నిజస్థితి ననుసరించియు, కలియుగ ప్రారంభమునకు 37 సంవత్సరములకుఁ బూర్వము పాండవకౌరవులకు జరిగిన భారతయుద్ధము మొదలు ప్రారంభ మగుచున్నది.

ప్రాచీన పురాణేతిహాసములంబట్టి, ఆ యుద్ధము ముగిసినతోడనే యుధిష్ఠిరుల పట్టాభిషేకకాలమైన క్రీ. ము. 3139 మొదలు యుధిష్ఠిరశకము ప్రారంభమయ్యెనని యిదివఱలోనే వివరింపఁబడినది. ఆ ప్రభువుయొక్క పట్టాభిషేక మహోత్సవకాలములో మగధరాజ్యము నేలుచుండినవాఁడును బార్హద్రధవంశములోఁ జేరినవాఁడును సహదేవుని తనయుండును జరాసంధుని పౌత్రుండునగు మార్జారియొక్క ప్రభుత్వకాలము మొదలు గుప్తవంశములో మొదటివాఁడగు చంద్రగుప్తుని ప్రభుత్వ ప్రారంభకాలమైన క్రీ. ము. 328 వఱకు 8 వంశములనఁగా, బార్హద్రధ, ప్రద్యోత, శిశునాగ, నంద, మౌర్య, శృంగ, కాణ్వ, ఆంధ్రవంశములనెడు 8 వంశములలోఁ జేరిన ప్రభువులు సుమారు 2800 సంవత్సరములు మగధరాజ్యమును పాలించిరి. ఆయావంశములోఁ జేరిన రాజులయొక్క నామధేయ

ములును, వారి ప్రభుత్వకాలములుంగూడ మన పురాణగ్రంథము లగు వాయు, మత్స్య, విష్ణు, భాగవత, బ్రహ్మాండ పురాణముల వల్లను, భవిష్యోత్తర పురాణములోఁజేరిన కలియుగ రాజవృత్తాంత మువల్లను దెలియఁగలవు.

పైఁగనిన బార్హద్రథ వంశముమొదలు 5-వ వంశమగు మౌర్యవంశము, చంద్రగుప్తమౌర్యునివలన స్థాపింపఁబడినది. ఇతఁడు నందవంశములోఁ జేరిన మొదటిప్రభువగు మహాపద్మనందుఁడను ధననందునికి మురయను శూద్రస్త్రీవలన జన్మించినవాఁడు. మఱియుఁ బై నందున కతని ధర్మపత్నియగు సునందవలన నెనమండ్రు కొమాళ్లు గలిగిరి. నందునకుఁ బిదప సుమాల్యుఁడను నతని జ్యేష్ఠ పుత్త్రుఁడు తక్కిన యెనమండ్రు భ్రాతలతోఁగలిసి రాజ్యపరిపాలనము చేయుచుండెను. ఇట్లుండ, వీరికిని పైనవివరించిన మౌర్యచంద్రగుప్తుని కిని మనస్తాపములుగలిగి, మౌర్యచంద్రగుప్తుఁడు మఱియొక చాణక్యుఁడను బ్రాహ్మణుని సహాయమువలనఁ బై నందవంశపురాజులను సంహరించి యుధిష్ఠిరశకము 1604 కు సరియయిన క్రీ. పూ. 1535 లో రాజ్యభారమును వహించెను. ఈవిషయము మన పురాణములవలననేగాక, కలియుగ రాజవృత్తాంతము, జైన, బౌద్ధ గ్రంథములగు పరిశిష్టపర్వము, మహావంశము, దీపవంశము మొదలగు గ్రంథములవలనఁగూడ విశదమగుచున్నది.

19. ఈ మౌర్యవంశముతోఁజేరి నాలుగువంశములవారు మగధరాజ్యమును దాదాపు 1200 సంవత్సరములవఱకు పాలించిన పిదప, గుప్తవంశములోఁజేరిన చంద్రగుప్తుఁడు మగధరాజ్యమునకుఁ ప్రభువయ్యెను. ఇతఁడు నేపాళదేశస్థుఁడగు మఱియొక ఘటోత్కచుని పుత్త్రుఁడు. మఱియు నితఁడాంధ్రవంశజులగు రాజులలో ముప్పదవ వాఁడగు "విజయశ్రీశాతకర్ణి" యొక్క ప్రభుత్వకాలములో మొదటసేనానాయకోద్యోగమునఁజేరి రాజ్యమును శత్రువులపాలంబడనీక రక్షించుచుండెను. పై వంశములో ముప్పదియొకటవ ప్రభువగు

"చంద్రశ్రీశాతకర్ణి" అనువాఁడు లిచ్ఛావు లనెడు మ్లేచ్ఛజాతిలోఁ జేరినయొక స్త్రీయొక్క సౌందర్యాతిశయమువలన దానిని వివాహ మాడెను. చంద్రగుప్తుఁ డదివఱలో నేపాళదేశపు ప్రభువుయొక్క కుమార్తెయగు "కుమారదేవి" యను స్త్రీని వివాహమాడియుఁ జంద్రశ్రీ శాతకర్ణియొక్క మఱఁదలినిగూడఁ బిదపవరించిన హేతువు వలన రాచకార్యములనన్నిటిని స్వతంత్రించి తానే జరుపుచువచ్చెను. ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట చంద్రశ్రీశాతకర్ణియొక్క భార్య చంద్రగుప్తుని మోహించి యతనివలనఁ దనపెనిమిటిని జంపించెను. పై చంద్రశ్రీశాతకర్ణికిఁ బిదప బాల్యదశయందున్న మూఁడవ పులోమఁడను నతనికుమారుఁడు ప్రభువయ్యెను. అతనికి సంరక్షణ కర్తగాఁ జంద్రగుప్తుఁడే మునుపటివలె రాజ్యమునేలుచువచ్చి కొన్నాళ్లకు పైనుదాహరించిన పులోమునిగూడఁ జంపి తానే పరిపూర్ణాధికారముతో క్రీ. ము. 328 లో రాజ్యభారమును వహించెను. ఈ చంద్రగుప్తునికి కుమారదేవియందు సముద్రగుప్తుఁడను పుత్త్రుఁడు జన్మించెను. మఱియు నతనికి మ్లేచ్ఛస్త్రీయందు ఘటోత్కచుఁడను మఱియొకపుత్త్రుఁడు పుట్టెను. వీనికి చంద్రగుప్తుఁడు తనరాజ్యము నప్పగింపఁ దలంపుగొనియుండ, నింతలో సముద్రగుప్తుఁడు నిజజనకుని సంకల్పముం దెలిసికొని తన తండ్రితోఁ గలహించి నేపాళదేశమునకుంజని తన మాతామహునియండఁజేరి నేపాళరాజ్యమును విదేశీయుల బారింబడనీయక కాపాడుచుండెను. పదంపడి కొంతకాలమునకు సముద్రగుప్తుఁడు నేపాళమునుండి గొప్పసేనలతో నేతెంచి మగధరాజధానియగు పాటలీపురమును ముట్టడించి తనజనకుని తన తమ్ముఁడగు ఘటోత్కచునింగూడ సంహరించి క్రీ. ముం. 321 లో మగధరాజ్యమునకుఁ బ్రభువయ్యెను.

20. గ్రీసుదేశపు ప్రభువగు "అలెగ్జాండర్" అను వాఁడు క్రీ. ము. 326 లో మనదేశముపై దండెత్తివచ్చినప్పుడు పైఁగనినగుప్త వంశజుఁడగు చంద్రగుప్తుఁడు మగధరాజ్యమునకుఁ బ్రభువుగనుండెను.

మఱియుఁ బైనవివరించిన చంద్రగుప్తుని పుత్త్రుఁడగు సముద్రగుప్తుఁ డనుపమాన పరాక్రమంబున నలెగ్జాండర్ చక్రవర్తిని నెదుర్కొని యాతనితోఁ బోరి యావిదేశీయుని మనదేశమునుండి క్రీ. ము. 324 లో వెడలఁగొట్టినదేగాక తనరాజ్యమును నలువైపుల విస్తరింపఁజేసికొని పారసీకతెగలోఁ జేరిన శకులను, గ్రీకుతెగవారగు యవనులను సహా హిందూదేశమునుండి పాఱఁదోలి యుత్తరహిందూస్థానముననున్న చిన్నచిన్న రాజ్యములనెల్ల వశపఱుచుకొని యార్యావర్తమునకంతయు నేకచ్ఛత్రాధిపత్యమును వహించి "ఇండియన్ -- నెపోలియన్" యను ఖ్యాతినిబొంది తన దిగ్విజయమును చాటించి యశ్వమేధయాగముంగూడ గావించెను.

మఱియుఁ బై సముద్రగుప్తుని కాలమునఁగా, క్రీ. ముం. 302 లో గ్రీసుదేశమునుండి "మెగస్తెనిస్" అను వాఁడు రాయబారిగ నతని రాజసభకు వచ్చియుండి మనదేశ విశేషములను గుఱించి "ఇండికా" అను గ్రంథమును వ్రాసెననికూడఁ దెలియవచ్చుచున్నది.

**మఱియు,** "అలెగ్జాండర్" హిందూదేశముపై దండెత్తినప్పుడు, గంగాతీరమున "క్జాండ్రామస్" అను పేరుగల బలాఢ్యుఁడగు నొకప్రభువుండెననియు, అలెగ్జాండర్ దండయాత్రకుఁ బిదప "సాండ్రకోటస్, లేక, సాండ్రసిప్టస్" అను వానివలన నొక నూతనరాజ్యము స్థాపింపఁబడినదనియు, జస్టిన్, అరియన్, ప్లూటార్క్ మొదలగు విద్వాంసులు వ్రాసిన యలెగ్జాండరు చరిత్రమువలనఁ దెలియుచున్నదని పాశ్చాత్య పండితుఁడగు "మాక్సుముల్లర్" వ్రాసియున్నాఁడు. (Vide "Maxmuller's History of Ancient Sanskrit Literature" Allahabad Edition, pages 141 to 143). మాక్స్యముల్లరుచే వ్రాయఁబడి అలహాబాదులోఁ బ్రచురపఱుపఁబడిన ప్రాచీన సంస్కృత వాఙ్మయ చరిత్రమున 141 వ పుట మొదలు 143 వ పుటవఱకుఁ జూడుఁడు.)

ఇందువలన నలెగ్జాండర్ హిందూదేశముపై దండెత్తినకాలములో గుప్తవంశములోఁ జేరిన చంద్రగుప్తుఁడు మగధరాజ్యమును బాలించుచుండెననియు, అలెగ్జాండర్ హిందూదేశమునుండి వెడలఁగొట్టఁబడినపిదపఁ జంద్రగుప్తుని కొమారుఁడు సముద్రగుప్తుఁడు మగధరాజ్యమునకేగాక యుత్తర హిందూస్థానమునకంతయుఁ బ్రభువై నూతనరాజ్యమును స్థాపించెననియు, స్థిరపడుచున్నది. వాస్తవాంశమిట్లుండ, మనదేశపు ప్రాచీనచరిత్రమును వ్రాసిన వి. ఎ. స్మిత్ మొదలగు పాశ్చాత్య పండితులు పైన వివరించిన "జస్టిన్" ఆదిగాఁగల విద్వాంసులు వ్రాసిన "అలెగ్జాండరు" చరిత్రమునం దుదాహరింపఁబడిన "సాండ్రకోటస్" అను గుప్తవంశజుఁడగు సముద్రగుప్తుని మౌర్యవంశపు చంద్రగుప్తునిగ భావించి మౌర్యవంశపు చంద్రగుప్తుఁడు మగధరాజ్యమునకు క్రీ. పూ. 322 లోఁ బ్రభువయ్యెననియు, ఆవంశములోఁ గడపటివాఁడగు బృహద్రథునిజంపి యతనిసేనానాయకుఁడగు పుష్యమిత్రుఁడు క్రీ. పూ. 185 లోఁ బ్రభుత్వమునకు వచ్చినట్లును, పొరపాటుగఁ గాలనిర్ణయములఁజేసి చరిత్రములను వ్రాసియున్నారు. (Vide Ancient and Hindu India by Mr. V. A. Smith pages 73 & 118. వి. ఎ. స్మిత్ వ్రాసిన హైందవుల ప్రాచీనచరిత్రములో 73 & 118 పుటలను జూడుఁడు.)

21. పైఁగనిన చంద్రగుప్త మౌర్యుఁడు వాస్తవస్థితిలో మగధరాజ్యమునేలిన 9 వంశములపైకి నాల్గవవంశమగు నందవంశపుఁ బ్రభువులయిన సుమాల్యుఁడాదిగాఁగల యెనమండ్రురాజులను మఱియొక చాణాక్యుఁడను బ్రాహ్మణుని సహాయమువలన సంహరించి, క్రీ. పూ. 1535 లో రాజ్యభారమును వహించి క్రీ. పూ. 1501 వఱకు 34 సంవత్సరములకాలము ప్రభుత్వముచేసెను.

ఇతనికాలమునకును నలెగ్జాండర్ మనదేశముపై దండెత్తినకాలమునకును సుమారు 1200 సంవత్సరములు వ్యత్యాసమున్నది. మఱియు నితని ప్రభుత్వకాలమున హిందూదేశములో నేవిధమైన

కలహము లుండినట్లుగాని యితరదేశస్థులు మనదేశముపయి దండె-త్తివచ్చినట్లుగాని యేచరిత్రవలనను దెలియవచ్చుటలేదు.

మఱియు, ఆకాలమునందు గ్రీసురాజ్య మేర్పడనేలేదు. పిదప సుమారు 1200 సంవత్సరములకు "అలెగ్జాండర్" ప్రబలుఁడాయెను. గుప్తవంశపుఁ జంద్రగుప్తుని ప్రభుత్వకాలమయిన క్రీ. ము. 326 లో నలెగ్జాండర్ హిందూదేశముపై దండెత్తి పైచంద్రగుప్తుని కుమారుఁడగు సముద్రగుప్తునివలన క్రీ. ముం. 324 లో హిందూదేశము నుండి తఱుమఁగొట్టఁబడియె.

మఱియు, గ్రీసుదేశపు చరిత్రకారుఁడగు "ప్లూటార్కు" అనువాఁడు వ్రాసిన చరిత్రములోఁ గనఁబఱచియుండుప్రకార మూఁడు లక్షల సైన్యముతో హిందూదేశమున సంచరించి దేశమునంతయు వశపఱచుకొన్నవాఁడు సముద్రగుప్తుఁడేకాని చంద్రగుప్తమౌర్యుఁ డెంతమాత్రమును కాఁడు.

ఇంకను చంద్రగుప్త మౌర్యుఁడు తన మంత్రి చాణక్యుఁడు చెప్పిన ప్రకారము ప్రవర్తించుచుండినట్లును, సముద్రగుప్తునివంటి సామర్థ్యముగలవాఁడు కాఁడనియుఁ దెలియవచ్చుచున్నది.

పై కారణములవలన అలెగ్జాండరును గుఱించి గ్రీకులువ్రాసిన చరిత్రములలో "క్జాండ్రామస్" "సాంద్రకోటస్" లేక "సాంద్రసిప్టస్" అని యుదాహరింపఁబడియుండువారు, గుప్తవంశపు చంద్రగుప్తుఁడు, అతని కుమారుఁడు సముద్రగుప్తుఁడు, వీరలేకాని చంద్రగుప్తమౌర్యుఁడని తలఁచుట కేమాత్రమును సాధ్యములేదు. ఆధారమును గనఁబడదు.

అట్లుండియు, పాశ్చాత్య పండితుఁడగు "మాక్సుముల్లరు" పైన వివరించిన జస్టిన్, ప్లూటార్కు మొదలగు గొప్పవిద్వాంసులు వ్రాసిన చరిత్రములలోఁ గనఁబఱచిన "సాంద్రకోటస్, లేక, సాంద్రసిప్టస్" అను నామధేయము, అశోకుని పితామహుఁడగు చంద్రగుప్తమౌర్యుని నుద్దేశించి వ్రాయఁబడినట్లు నిర్ధారణచేసెను.

(పై నుదాహరించిన ప్రాచీన సంస్కృత వాఙ్మయ చరిత్రము న 141 వ పుట మొదలు 143 వ పుట వఱకు చూడుఁడు.)

హిందూదేశముయొక్క ప్రాచీన చరిత్రమును వ్రాసిన పాశ్చాత్య చరిత్రకారు లందఱు క్రిందిది యభిప్రాయమును వేదవాక్యముగ గ్రహించిరి. ఆ గొప్ప పండితుఁడు వ్రాసిన పై గ్రంథమువలననే యలెగ్జాండర్ కాలములో "జాండ్రామస్" అనువాఁడు మగధరాజ్యమును బాలించుచుండెనని "జస్టిన్" మొదలగు విద్వాంసులు వ్రాసినట్లు కనఁబడును. ఆ "జాండ్రామస్" అనువాఁ డెవఁడైనదిన్ని యితఁడు నిర్ణయించియుండలేదు.

అయినను, గుప్తవంశపుఁ జంద్రగుప్తునికిముందు, ఆంధ్రరాజ్యము నేలుచున్నవాఁడును, పై చంద్రగుప్తునివలనఁ జంపఁబడినవాఁడు నగు "చంద్రశ్రీ" యను వాని నుద్దేశించి "జాండ్రామస్" అని వ్రాసియుండనగునని చెప్పఁదగియున్నదేకాని, మఱియొక నామధేయ సామ్యమగపడదు. చంద్రగుప్త మౌర్యునికిఁ బూర్వము "జాండ్రామస్" అను నామధేయముగల ప్రభువే కనఁబడఁడు. మఱియు "చంద్రశ్రీ" అనువాఁడు, అలెగ్జాండర్ కాలములో మగధరాజ్యము నేలుచున్నవాఁడును కాఁడు.

పైన వివరించిన కారణములవలన "జాండ్రామస్" అను నామధేయము, గుప్తవంశపు చంద్రగుప్తుని నుద్దేశించి వ్రాయఁబడినట్లే యెన్నఁదగియున్నది. ఇతరవిధముగ నభిప్రాయపడుటకు వీసెంత మాత్రమును లేదు. మీఁదగనిన పొరపాటువలన హిందూదేశము యొక్క ప్రాచీనచరిత్రమునందు ప్రతిసంగతిలోను కాలభేదము కనఁబడుచున్నది.

(ఈవిషయమై నారాయణశాస్త్రిలుగారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B. భాగమున కనుబంధమగు మగధరాజుల వృత్తాంతమును చూడుఁడు.)

22. మఱియు, పాశ్చాత్యులు వ్రాసిన హిందూదేశపు

ప్రాచీన చరిత్రములో నింకొక లోపముగూడఁ గలదు. దానిని సంగ్రహముగ వివరించుచున్నాను. మనపురాణములలో నందవంశముయొక్క తుదివఱకే కతీరున నే యాయావంశములోఁజేరిన ప్రభువుల ప్రభుత్వకాలము నిర్ణయింపఁబడియున్నది. మౌర్యవంశము మొదలు వానిలోఁ గొన్నిటియందచ్చు పొరబాటులవలనను, గ్రంథమసంపూర్తిగ నుండుటచేతను, భేదములు కనఁబడును. అయినను, కలియుగరాజ వృత్తాంతములోమాత్రము సమగ్రముగ నన్నివంశములు నేవిధమయిన ప్రమాదములు లేక క్రమముగ నుదాహరింపఁబడియుండుటయేగాక, కొన్నిపురాణములుకూడ దాని ననుసరించియుండుటచే నట్లు దృఢపడిన యాయావంశముయొక్క ప్రభుత్వకాలము నంగీకరింపఁదగియున్నది.

ఇదియునుంగాక, మగధరాజ్యము నేలిన రాజుల ప్రభుత్వకాలము, పురాణములలో నేకరీతిగ యుధిష్ఠిర శకప్రకారముగను, సప్తర్షి శకక్రమముగను, రెండు తెఱంగులుగ నుదాహరింపఁబడి యుండుటవలన, కొన్నిపురాణములలోఁ బైన వివరించిన విధమునఁ బొడసూపు ప్రమాదములను సప్తర్షిశకముంబట్టి సవరించుకొనుట కనుకూలము గూడఁగలదు.

మఱియు, మగధరాజ్యము నేలిన రాజుల ప్రభుత్వకాలముం గూర్చి సప్తర్షి శక ప్రకారముగాఁ బురాణములలో భేదమెంతమాత్రమును లేదు.

ఇఁకఁ బురాణములలోఁ బైవంశములంగూర్చి చెప్పఁబడియుండు వృత్తాంతముల నెఱింగించెద.

తెనుఁగున నచ్చొత్తఁబడియుండు మత్స్యపురాణముయొక్క శుద్ధప్రతిలో నీతీరున వ్రాయఁబడియున్నది.

శ్లో॥ మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరీక్షితం।
ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరం॥
(అధ్యాయము 271. శ్లో, 38).

మఱియు, వాయు, బ్రహ్మాండ, పురాణముల శుద్ధప్రతుల లోను కలియుగరాజవృత్తాంతములోను, పై తీరుననే వ్రాయఁబడి యున్నది.

ఇందువలన పరీక్షితుని జననకాలమగు యుధిష్ఠిర పట్టాభిషేక మహోత్సవ తరుణమనఁగా, యుధిష్ఠిరశక ప్రారంభమయిన కాలము (క్రీ. పూ. 3139) మొదలు మహాపద్మనందుని ప్రభుత్వ ప్రారంభ కాలము వఱకు 1500 సంవత్సరములని తెలియఁదగియున్నది.

పై కాలము, మనపురాణములలో నందవంశపు రాజుల ప్రభుత్వ ప్రారంభకాలమువఱకు, ఆయావంశములోఁ జేరిన రాజుల విషయమై నిర్ణయింపఁబడియుండు 1504 సంవత్సరముల కించుమించుగ సరిపోవును.

ఇదియునుంగాక, మత్స్య, వాయు, బ్రహ్మాండపురాణములలో మహాపద్మనందుని కాలము మొదలాంధ్రవంశపు రాజుల ప్రభుత్వ ప్రారంభకాలమువఱకు 836 సంవత్సరములు జరుగునని దిగువ కనఁబఱచియుండు ప్రకారము వివరింపఁబడియున్నది.

శ్లో॥ ప్రమాణం వై తథాచోక్తం మహాపద్మాంతరంచయత్।
అంతరంచ శతాన్యష్టౌ షట్త్రింశచ్చ సమాస్స్మృతాః
ఏతత్కాలాంతరంభావ్యా ఆంధ్రాంతాద్యాప్రకీర్తితాః॥

పై విషయమై కలియుగరాజవృత్తాంతములో మాత్ర మీతీరు ననున్నది.

శ్లో॥ ఆంధ్రరాజ్యాభిషేకమాత్తు యావన్నందాభిషేచనమ్।
అంతరంతచ్ఛతాన్యష్టౌ ప్రమాణజ్ఞైస్సమాస్స్మృతాః॥

తా॥ మహాపద్మనందుని ప్రభుత్వకాలమునకును నాంధ్రవంశపు మొదటి ప్రభువుయొక్క ప్రభుత్వకాలమునకును, 800 సంవత్సరము లంతరముగలదని ప్రమాణజ్ఞులచే వక్కాణింపఁబడెను.

అయినను, నందవంశము మొదలాంధ్రవంశ ప్రభుత్వ ప్రారం

భవమువఱకు మగధరాజుల ప్రభుత్వ కాలము నిష్కృష్టగ, 801 సంవత్సరములని యేర్పడుచున్నది. విశేష భేదములేదు.

మఱియు, మగధరాజ్య ప్రభువుల ప్రభుత్వకాల పరిమితిం గూర్చి, వాయు, బ్రహ్మాండ పురాణములు సప్తర్షిశక ప్రకారముగా నీతీరునం దెల్పుచున్నవి.

1 శ్లో॥ సప్తర్షయో మఘాయుక్తాః కాలేపారీక్షితేశతమ్।
ఆంధ్రాంశేతుచతుర్వింశే భవిష్యంతి శతంసమాః ॥
(బ్రహ్మాండపురాణము 74 వ అధ్యా. 236 వ శ్లో.)

2 శ్లో॥ సప్తర్షయో మఘాయుక్తాః, కాలేపారీక్షితేశతమ్ ।
ఆంధ్రాంశేచ చతుర్వింశే, భవిష్యంతి మతేమమ॥
(వాయు, 99 వ అధ్యా. 423 వ శ్లో.)

పై విషయమై కలియుగరాజవృత్తాంతములో నీతీరునం గనంబడును.

3 శ్లో॥ సప్తర్షయో మఘాయుక్తాః, కాలేయాధిష్ఠిరేశతం।
శ్రవణేతే భవిష్యంతి, కాలేనందస్య భూపతేః॥

4 శ్లో॥ చతుర్వింశేధ నక్షత్రే భవిష్యంతి శతంసమాః ।
ఆంధ్రరాజ్యారంభకాలా, దారభ్యైతే సురర్షయః॥

1, 2 శ్లోకముల తాత్పర్యము:—

పరీక్షితుని ప్రభుత్వకాలమున సప్తర్షులు మఘానక్షత్రమున 100 సంవత్సరములుండిరి. ఆంధ్రవంశపురాజుల ప్రభుత్వ ప్రారంభ కాలమునకు 2400 సంవత్సరములు కాంగలదు.

3, 4 శ్లోకముల తాత్పర్యము.

యుధిష్ఠిరుని కాలములో సప్తర్షులు మఖలో 100 సంవత్సరములుండిరి. మహాపద్మనందుని ప్రభుత్వ ప్రారంభకాలములో మఖనుండి యప్రదక్షిణముగ 16 వ నక్షత్రమగు శ్రవణనక్షత్రముం జేరుదురు. ఆంధ్రవంశపు ప్రభువుల ప్రభుత్వ ప్రారంభకాలములో మఖనుండి పై రీతిగ 24 వ నక్షత్రముగు చిత్తానక్షత్రముం జేరుదురు.

మఱియు, కలియుగ రాజవృత్తాంతములో సప్తర్షిశక ప్రారంభముం గూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

1 శ్లో॥ యదాయుధిష్ఠిరోరాజా, శక్రప్రస్థే ప్రతిష్ఠితః ।
తదాసప్తర్షయఃపిత్రుః, మఘాః పితృహితేరతాః ॥

2 శ్లో॥ పంచసప్తతివర్షాణి, ప్రాక్కలేస్సప్తతేద్విజాః ।
మఘాస్వాసన్ మహారాజే, శాసత్యుర్వీం యుధిష్ఠిరే॥

3 శ్లో॥ పంచవింశతివర్షేషు గతేష్వథ కలౌయుగే।
సమాశ్రయిష్యన్త్యాశ్లేషాం, మునయస్తేశతంసమాః॥

4 శ్లో॥ తదైవధర్మపుత్రోపి, మహాప్రస్థాన మాస్థితః ।
భువంపరిభ్రమన్నంతే, స్వర్గమారోక్ష్యతిధ్రువమ్।

5 శ్లో॥ తదైవ లౌకికాబ్దోపి, సప్తవింశశతాత్మకః ।
ధర్మపుత్రజ్ఞాపకార్థం, లోకేతావత్ప్రవర్తితః ॥

6 శ్లో॥ సప్తవింశాంధ్రనృపతేః కాలేభావ్యస్యతేపునః ।
ఆశ్లేషాంసంప్రయాస్యంతి, యుగస్యాంతే సురర్షయః॥

తా॥ యుధిష్ఠిరమహారాజు తన పిత్రార్జితమగు రాజ్యములో నర్ధభాగంబు స్వీకరించి ప్రథమంబున నింద్రప్రస్థంబునఁ బట్టాభిషిక్తుఁడైన కాలంబున, మరీచి, వసిష్ఠ, అంగిరస, అత్రి, పులస్త్య, పులహ, క్రతులను సప్తర్షులు పితృదేవతలకుఁ బ్రీతికరంబగు మఘానక్షత్రమునం బ్రవేశించిరి.

2. కలియుగ ప్రారంభమునకు 75 సంవత్సరములకు ముందనఁగా, క్రీ. పూ. 3177 లో యుధిష్ఠిర మహారాజుయొక్క ప్రభుత్వ ప్రారంభకాలమున సప్తర్షులు మఘయందుఁ జేరిరి.

3 ఈసప్తర్షులు కలియుగ ప్రారంభమైన 25 సంవత్సరములనఁగా, క్రీ. పూ. 3077 లో నప్రదక్షిణముగ నాశ్లేషయందుఁ జేరి 100 సంవత్సరముల కాలమచ్చటనే యుందురు.

4. శ్రీకృష్ణ నిర్యాణానంతరము కలిప్రారంభమయినతోడనే క్రీ. పూ. 3102 లో ధర్మజుఁడు, తనరాజ్యమును కర్జునుని మనుమఁ

డగు పరీక్షితుని ప్రభువుగ నేమించి, తన ధర్మపత్ని యగు ద్రౌపది యుఁ దన కనురూపులగు ననుజులుం దన్ను వెన్నంటిరాఁగ, మహా ప్రస్థానయాత్రకు బయలువెడలి దీర్ఘకాలం బుర్వింజరించుచు నప్పు డే యనఁగా, క్రీ. ము. 3077 లో స్వర్గం బారోహించును.

5. సత్యశీలుఁడగు ధర్మజుని జ్ఞాపకార్థంబుగ నతని స్వర్గారో హణ కాలముమొదలు 2700 సంవత్సరముల కాలపరిమితిగల లౌకిక శకంబొకటి ప్రారంభమగును.

6. సప్తర్షులు నక్షత్రమున కొకటింటికి 100 సంవత్సరముల వంతున, నిరువదియేడు నక్షత్రముల నప్రదక్షిణముగఁ జుట్టివచ్చి యాంధ్రవంశపు రాజులలో నిరువదియేడవ పురుషుని పాలన ప్రారం భమున మరల నాశ్లేషం జేరుదురు.

పై వృత్తాంతమువలన, పరీక్షితుని జననకాలమగు ధర్మనం దనుని పట్టాభిషేక కాలము మొదలు, నందవంశమున మొదటివాఁ డగు మహాపద్మనందుని ప్రభుత్వ ప్రారంభము వఱకు, 1500 సంవత్స రములు గతించుననియు, పైనందుని కాలమునకును, ఆంధ్రవంశ పు మొదటి ప్రభువుయొక్క ప్రభుత్వ ప్రారంభకాలమునకును, 800 సంవత్సరము లంతరముగలదనియు స్పష్టమయ్యెను.

ఈ యంశము, పాండవాగ్రజుని స్వర్గారోహణ కాలమగు క్రీ. ము. 3077 మొదలు ప్రారంభమైన సప్తర్షిశకమునందు పైమ హర్షుల చారమువలనఁగూడ దృఢపడుటయేగాక, సప్తర్షు లాంధ్రప్ర భువులలో నిరువదియేడవ పురుషుని ప్రభుత్వప్రారంభమున, నిరువది యేడు నక్షత్రములతోఁగూడిన జ్యోతిశ్చక్రము నొక్కతేప చుట్టి వచ్చి యాశక ప్రారంభ నక్షత్రమగు నాశ్లేషను మఱలఁ జేరుదురని యు, వ్యక్తమగుచున్నది.

మఱియు, సప్తర్షిశక మొకసారి పూర్తియగుటకు 2700 సంవ త్సరములు పట్టుటవలనను, సప్తర్షిశకము క్రీ. ము. 3077 లోఁ బ్రారంభమైనది గనుకను, ఆంధ్రవంశపు నిరువదియేడవ పురుషుఁడ

గు "శివశ్రీశాతకర్ణి"యొక్క ప్రభుత్వ ప్రారంభకాలము, క్రీ. పూ. 377 అని నిష్కర్షగ నేర్పడుటయేగాక, పై వంశమునఁ బదునెనిమిదవ ప్రభువగు "హాలుని" ప్రభుత్వకాలము సహితము నిస్సంశయముగ, క్రీ. పూ. 5వ శతాబ్దాంతమనియు, దృఢపడుచున్నది. మఱియు నాకాలములోనే శ్రీశంకరభగవత్పాదులవారుకూడ వర్ధిల్లినట్లు మన పురాణాది ప్రాచీన గ్రంథముల్లవలనఁ గనఁబడును. పైఁగనిన "శివశ్రీశాతకర్ణికి" బిదప సుమా రేఁబది సంవత్సరముల కాంధ్రవంశములోఁ గడపటివాఁడగు "పులోముని" జంపి గుప్తవంశజుఁడగు చంద్రగుప్తుఁడు క్రీ. పూ. 328 లో మగధరాజ్యమునకుం బ్రభువయ్యెను.

మఱియు, కలియుగ రాజవృత్తాంతములో సప్తర్షికరీతిగ వివరించియుండు మగధరాజులంగూర్చిన పై వృత్తాంతమే, తక్కిన పురాణములలోను నుదాహరింపఁబడి యున్నది. భేదమెంతమాత్రమును లేదు. మౌర్యవంశము మొదలు మగధరాజ్యమునేలిన ప్రభువుల ప్రభుత్వకాలమును గుఱించి కొన్ని పురాణములలో భేద మగపడినను సప్తర్షులచారముంగూర్చి పురాణము లొక్కతీరుననే యుండుటవలనఁ బై వ్యత్యాసములనునెట్టి పురాణము లేకవాక్యగ నుద్ఘోషించునట్టి యాయా వంశముయొక్క ప్రభుత్వకాలంబే గ్రాహ్యంబు.

23. అట్లుండియు, పాశ్చాత్యపండితులు కొన్నిపురాణములలో మహాపద్మనందుని కాలముమొద లాంధ్రప్రభువుల ప్రభుత్వ ప్రారంభమువఱకు 836 సంవత్సరము లంతరము గలదని తెల్పువాక్యములలో "ఆంధ్రాంశాద్యే" అనుపదమునకుబదు లాంధ్రప్రభువుల ప్రభుత్వముయొక్క యంత్యమని యర్థమియ్యఁదగిన "ఆంధ్రాంతాయే" అని యచ్చు పొరపాటుతోఁగూడిన పదము కనఁబడుటం జేసి మహాపద్మనందుని ప్రభుత్వ ప్రారంభముమొద లాంధ్ర వంశప్రభుత్వముయొక్క యంత్యమువఱకు 836 సంవత్సరము లంతరముగలదని యభిప్రాయపడి నంద, మౌర్య, శృంగ, కాణ్వ, అను నాలుగు వంశ

ముల ప్రభుత్వకాలమును 394 సంవత్సరములుగ గణించి యాంధ్రవంశపు పరిభువుల ప్రభుత్వకాలము 460 సంవత్సరములని నిర్ణయించిరి.

మఱియు, పరీక్షితుని జననకాలమునకును, మహాపద్మనందుని ప్రభుత్వ ప్రారంభమునకును గల మధ్యకాలపు పరిమితి 1500 సంవత్సరములని పురాణము లుద్ఘోషించుచుండఁగా, వానిపైకిఁ గొన్నింటిలో "ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచశతోత్తరమ్" అనుటకు బదులుగ "ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్" అనియు "పంచదశోత్తర మ"నియు వచ్చుపాఠపాట్లుండుటవలన వానిం జక్కఁగ విమర్శించి చూడకయే పై కాలపరిమితిని సహా 1050, లేక, 1015 సంవత్సరములుగానో తగ్గించియు, క్రీస్తు పుట్టుటకు 3139 సంవత్సరములకుముందు జన్మించిన పరీక్షితుని జననకాలమునుగూడ ముందుకుఁద్రోసియు, ప్రాచీన పురాణముల ననుసరింపక వారియిష్టానుసారము కాలనిర్ణయములఁ జేసి క్రీ. ము. 1535 లో మగధరాజ్యమునకుఁ బ్రభువుగ నేర్పడిన చంద్రగుప్త మౌర్యుని క్రీ. ము. 322 వ సంవత్సరమునకుఁ దెచ్చినదేగాక, "అలెగ్జాండరు" హిందూదేశముపై దండెత్తిన కాలమైన క్రీ. ము. 326 లో మగధరాజ్యము నేలుచుండిన గుప్తవంశపు జంద్రగుప్తుని క్రీ. వె. 320 వ సంవత్సరమునకునెట్టిరి.

మఱియు, శ్రీమదాచార్యస్వాములవారి కాలములో మగధరాజ్యమునకు క్రీ. ము. 495 లోఁ బ్రభువుగ నేర్పడిన యాంధ్రవంశజుఁడగు "హాలుని" క్రీ. వె. 69 వ సంవత్సరమునకుం గొనిపోయిరి. హిందూదేశముయొక్క ప్రాచీన చరిత్రమును వ్రాయుటలోఁ బాశ్చాత్త్యులు ప్రాచీనపురాణములయం దుపేక్షవహించి, శాసనములను, నాణెములను, మఱియు జ్ఞాపకార్థంబుగ నిర్మించిన శిలాస్తంభములు మొదలగు చిహ్నముల నాధారముగ గ్రహించినట్లు తెలియవచ్చుచున్నది. అయినను, క్రీస్తు పుట్టుటకు 5, లేక, 6 శతాబ్దములకు ముందు జరిగిన వృత్తాంతములను గుఱించి పై శాసనాది నిదర్శనములు కనఁబడినట్లు తెలియుటలేదు.

పాశ్చాత్యులువ్రాసిన హిందూదేశముయొక్క ప్రాచీన చరిత్రమునందు పైనవివరించిన పెక్కు కాలవ్యత్యాసములుండుటవలన, హిందూ, బౌద్ధ, జైన గ్రంథముల ననుసరించి మరల వ్రాసిననేకాని మనదేశపుఁ బ్రాచీనచరిత్రము చక్కఁబడదు.

(ఈవిషయమై నారాయణశాస్త్రిలవారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క I B భాగమునందలి సప్తర్షి శకమును గుఱించిన వృత్తాంతములో 147 వ పుట మొదలు 171 వ పుట వఱకుఁ జూడఁదగును.)

శ్రీశంకర భగవత్పాదులవా రవతరించిన కాలమును గుఱించి పెక్కుగ్రంథములను పరిశీలించినందులో, శ్రీచిత్సుఖాచార్య విరచితంబగు బృహచ్ఛంకరవిజయము మొదలైన ప్రాచీన గ్రంథములవలనను, కామకోటిపీఠమునకు సంబంధించిన గురుపరంపర పట్టిక, పుణ్యశ్లోకమంజరి, మొదలగు సాధనములవలననేగాక, ద్వారకాపీఠమును గుఱించిన వృత్తాంతము, జినవిజయము, వీనివలనను, ఆదిశంకరులవారి జననకాలము, క్రీ. పూ. 509 యనియే నిస్సంశయముగ నేర్పడుటవలన పై వివరించిన కాలమే శ్రీశంకరభగవత్పాదులవా రవతరించిన కాలమని నిర్ణయించడమైనది.





# అనుబంధము 3.

ఇందు శ్రీమదాచార్య్య స్వాములవారి పూర్వాచార్యులను గురించిన వృత్తాంతమును సంగ్రహముగ వివరించుచున్నాను.

వ్యాకరణసూత్రములను రచించిన "పాణిని" యను మహనీయులును, వరరుచియనంబడు కాత్యాయనులును, జైమినిముని కృత పూర్వమీమాంస సూత్రములకును, బాదరాయణులవారి వేదాంత సూత్రములకును, భాష్యగ్రంథములను వ్రాసిన ఉపవర్షాచార్యులవారి సోదరులగు వర్షాచార్యులవారివద్ద వ్యాకరణ శాస్త్రము నభ్యసించిరి.

పాణినియొక్క వ్యాకరణ సూత్రములకు కాత్యాయనులు వార్తిక గ్రంథమును, పతంజలిమునీంద్రులు భాష్యమును, రచించిరి. ఈపతంజలులు ఆదిశేషావతారపురుషులని వాడంబడుచున్నారు. మఱియు, వీరిసన్నిధియందే శ్రీమదాచార్యస్వాములవారి పరమ గురువులగు గౌడపాదాచార్యులవారు పూర్వాశ్రమమునం బుండరీకపురమను చిదంబరక్షేత్రమున వ్యాకరణ భాష్యము నభ్యసించుచు వచ్చిరి. వీరు ద్రవిడదేశస్థులు గనుక వీరికి ద్రావిడాచార్యులని నామాంతరమును గలదు.

ఇదియుంగాక, పతంజలిమునీంద్రులు మగధరాజ్యము నేలిన ప్రభువులపైకి శృంగవంశ స్థాపకుండగు పుష్యమిత్రు డొనర్చిన యశ్వమేధ యాగతరుణమున నున్నవారని వారిభాష్యమునందు కనంబడును. పైంగనిన పుష్యమిత్రుండు క్రీ. ముం. 1219 మొదలు, క్రీ. ముం. 1159 వఱకఱువది వత్సరముల కాలము మగధరాజ్యమును బాలించినట్లు మనపురాణముల వలనం దెలియవచ్చుచున్నది.

(నారాయణశాస్త్రిలవారు రచించిన గ్రంథముయొక్క I B భాగమునందలి మగధరాజుల వృత్తాంతములో 69, 70 పుటలను జూడుడు.)

కనుక పతంజలులు పైనుదాహరించిన కాలమందే యవతరించి యుండవలయును. అయినఁ బాశ్చాత్యులువ్రాసిన హిందూదేశపుఁ బ్రాచీన చరిత్రవలనఁ బుష్యమిత్రుఁడు క్రీ. ము. 185 లోఁ బ్రభుత్వమునకు వచ్చినపిదపఁ గొంతకాలమున నశ్వమేధయాగమును గూడ జరిగించినట్లు కనబడుటయేగాక, పతంజలిమునీంద్రులు వాని ప్రభుత్వకాలమున నున్నవారనియుఁ దెలియవచ్చుచున్నది.

మఱియు, మాక్సుముల్లర్, వీబర్ మొదలగు పాశ్చాత్యపండితులు పై మునీంద్రుల జననకాలముంగూర్చి క్రీ. ము. 250 మొదలు క్రీ. వె. 60 వఱకు వారివారికిం దోఁచినట్లు కాలనిర్ణయములను జేసినదేగాక, పై మునీంద్రులు యోగసూత్రములనుగూడ రచియించియుండుటచే, యోగసూత్రములను రచించిన పతంజలులు బాదరాయణులకుఁ బూర్వులనియు, వ్యాకరణభాష్యమును వ్రాసినవారు బాదరాయణులకు వెనుకటివారనియు నిద్దఱు పతంజలులు గలరనియు నభిప్రాయపడిరి. మఱియు, వారిభాష్యమునందు బుద్ధుఁడుపదేశించిన వేదవిహితములగు కొన్నిధర్మములుకూడఁ గనఁబడుట వలన గౌతమబుద్ధుఁడు చనిపోయినకాలమనఁగా క్రీ. ము. 543 కిఁ బిదపఁ బతంజలి మునీంద్రు లవతరించియుండవలయునని మఱికొందఱభిప్రాయపడిరి.

(పండిత భాష్యాచార్యులు రచించిన "The Age of Patanjali" (పతంజలులు వర్ధిల్లినకాలము) అను గ్రంథములో నాల్గవపుట మొదలాఱవపుటవఱకుఁ జూడుడు.)

పాశ్చాత్యపండితులలోఁ బై వివరించినరీతిగా భిన్నాభిప్రాయములుండినను, పతంజలిమునీంద్రులు పుష్యమిత్రునికాలమున వర్ధిల్లిరనుట నిర్వివాదాంశముగ నున్నది. అయినఁ బాశ్చాత్యులు

వ్రాసిన హిందూదేశచరిత్రలోఁ గనఁబడు కాలవ్యత్యాసములకు ముఖ్యకారణములను బైననుదాహరించినదేగాక బుద్ధునికాలమును గూడ నిష్కృష్టగఁ దెలిపియున్నాను. అయ్యంశంబులఁ బర్యాలోచనంబుఁగావించి చూచిన యెడల, పతంజలులు వర్ధిల్లినకాలముం గూర్చి పాశ్చాత్యులభిప్రాయపడిన విషయము పొరపాటని నిస్సంశయముగ నేర్పడఁ గలదు. మఱియు, పండిత భాష్యాచార్యులవారు రచించిన "The Age of Patanjali" అను గ్రంథములో పతంజలి మునీంద్రులు క్రీ. ముం. 10-వ శతాబ్దమున వర్ధిల్లినవారని కనఁబడుటయేగాక, వ్యాకరణసూత్రములకు భాష్యమును వ్రాసినవారును యోగసూత్రముల రచించినవారును గూడ నొకరేకాని యిద్దఱు కాదని స్పష్టముగ వ్రాసియున్నారు.

2. మఱియు, పతంజలిమునీంద్రుల సన్నిధానమున శ్రీశంకర భగవత్పాదులవారి పరమగురువులగు గౌడపాదాచార్యులవారు చిదంబరక్షేత్రమున వ్యాకరణ భాష్యము నభ్యసించిరని యెగువ నుదాహరించియున్నాను. ఆమునీంద్రు లాదిశేషావతార పురుషులగుటక గ్రంథకాలక్షేప సమయమున నొక యవనికాభ్యంతరంబున సహస్రముఖంబులతో వేయిమంది శిష్యుల కేకకాలంబునఁ బాఠముఁ జెప్పుచువచ్చిరి. వారిభాష్యోపదేశము పూర్తికాఁగల సమయమున వారియద్భుతాకారముం జూడఁగోరి, గౌడపాదులు తప్పఁ దక్కిన శిష్యులందఱును వారి నాతెరనుండి తొంగిచూచిరి. వారట్లు మర్యాదగఁ జూచినమాత్రమునఁ బతంజలుల సహస్ర ముఖముల నుండి మిగుల నుగ్రముతో వెలువడిన విషానలము వలన శిష్యులందఱు భస్మమైరి. అట్టి సమయమున బైటవెళ్ళి యుండిన గౌడపాదులవారేతెంచి వారితప్పును క్షమించునట్లు వేఁడుటయు, కాలక్షేప మధ్యభాగమున బైటికిఁ జనినవారి తప్పిదమునకు "నీవు బ్రహ్మరాక్షసునిగ జన్మింతువని" శపించినదే గాక, వారభ్యసించిన వ్యాకరణశాస్త్రమును సత్పాత్రుఁడగు శిష్యున కుపదేశించిన పిమ్మట నాశాప

విముక్తి కాఁగలదనిగూడ సెలవిచ్చి, పిదపఁ గొంతకాలమున శమ్మునీంద్రులు పరలోకగతులయిరి.

అంతట, గౌడపాదులవారు గురుశాపానుసారముగ బ్రహ్మరక్షస్సుగ నుత్తరహిందూస్థానమున సంచరించుచుండిన కాలములో నుజ్జయినీనగరమునఁ జంద్రశర్మయను పూర్వాశ్రమ నామధేయంబు గల శ్రీ గోవిందభగవత్పాదులవారు శ్రీ గౌడపాదాచార్యులను సంధించినందుపై, శాస్త్రాభ్యాస యోగ్యత వారికిఁగలదని యెఱింగి గౌడపాదాచార్యులవారు వ్యాకరణభాష్యమును చంద్రశర్మాచార్యులకు బోధించి శాపవిముక్తులయి, వేదాంతశాస్త్ర కాలక్షేపముకొఱకుఁ దగిన గురువును వెదకుచు, బదరికాశ్రమంబుచేరి యచ్చట తపంబొనర్చుచున్న బాదరాయణులవారియనుంగు తనయులును శిష్యులునగు శుకయోగీంద్రుల నాశ్రయించి వారివలన సన్న్యాసంబువడసి తత్త్వోపదేశముంబొంది, మాండూక్యోపనిషత్తునకుఁ గారికయును, ఉత్తరగీతకును సాంఖ్యకారికకును వ్యాఖ్యానములనుగూడ రచించిరి.

(నారాయణశాస్త్రిలవారు రచించిన "The Age of Sankara" అను గ్రంథముయొక్క ప్రథమభాగములో 46 వ పుట మొదలు 50 పుటవఱకుఁజూడుఁడు)

3. చంద్రశర్మాచార్యులు గౌడపాదాచార్యులవద్ద వ్యాకరణభాష్యమును పూర్తిగ నభ్యసించినవెనుక, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులనెడు నాలుగు వర్ణములలో నొక్కొక్క స్త్రీని వివాహము చేసికొని క్రమముగా భర్తృహరి, విక్రమాదిత్యుఁడు, భట్టి, వరరుచి యను నల్గురు పుత్త్రులంబడసి వారికి వ్యాకరణశాస్త్రమును బోధింపఁగా వారాశాస్త్రమును ప్రపంచమందంతటను వ్యాపింపఁజేసిరి.

పిదపఁ గొంతకాలమునకు, చంద్రశర్మాచార్యులు విరక్తులై బదరికాశ్రమంబుఁజేరి యచ్చట గౌడపాదాచార్యులవారివలన సన్న్యాసంబుఁగైకొని గోవిందమునియను నామధేయంబు వహించి వారి సన్నిధిలో వేదాంతగ్రంథములనుగూడ నభ్యసించి, నర్మదాతీరమున

నుండు అమరేశ్వరమను నగరంబుఁజేరి యద్వైత విద్యను శిష్యులకు బోధించుచుండి క్రీ. ముం. 494 లో నర్మదానద మధ్యభాగంబున నైడూర్యమణి పర్వతస్థంబగు మాంధాత ద్వీపమున సిద్ధిఁజెందిరి.

(పై వివరించిన శాస్త్రులవారి గ్రంథమునందు 50 వ పుట మొదలు 55 వ పుట వఱకుఁ జూడుఁడు.)

4. ఈ గోవిందభగవత్పాదులవారే శ్రీ మదాచార్యస్వాములవారి గురువులు. శ్రీశంకరభగవత్పాదులవారు బదరికాశ్రమంబునకేగి శ్రీ గౌడపాదాచార్యులవారి సన్నిధానంబుఁజేరిన కాలమున గౌడపాదాచార్యులవారు, నూటయిరువది సంవత్సరములు చెల్లిన వయోవృద్ధులని బృహచ్ఛంకర విజయమువలనఁ దెలియ వచ్చుచున్నది.

ఆకాలమున, శ్రీమదాచార్యస్వాములవారు సుమారు పదునాలుగు సంవత్సరముల వయస్సు చెల్లినవారని పై గ్రంథమువలననే కనఁబడును. ఇట్టినిదర్శనములంబట్టి శ్రీగౌడపాదాచార్యులవారు క్రీ. ము. 7 వ శతాబ్దాదిలో ననఁగా క్రీ. ముం. 615 లేక, యాకాలమునకుఁ గొంతముందు వెనుక జన్మించినవారని చెప్పఁదగియున్నది. పెక్కు ప్రాచీన గ్రంథములను సాధ్యమయినంతవఱకుఁ బ్రయాసపడి శోధించి ప్రతిసంగతికిని వానిలో నిర్ణయమైయుండు కాలమునే స్థిరపఱచియున్నాను. నేను నూతనముగఁ గనిపెట్టినది గాని, కల్పించినదిగాని యిందులేదు. అయిన నిందేదైన ప్రమాదంబు లగపడినయెడల, వానిని సహేతుకముగ నగపఱుపఁగల విబుధులకు మిగులఁ గృతజ్ఞుఁడనయి, నామనఃపూర్వకములగు నమస్కృతుల నర్పించుటయేగాక ప్రమాదంబుల సహితను పునర్ముద్రణంబున సవరించుకొనువాఁడ.

ఓం తత్సత్.